

'కాలం మారిందా?'

సంవత్సర చందా
రు. 12_0_0
విడిపత్రిక 4 అ.




సంపుటము 48
సంచిక 1
1-9-54

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

జయ భాద్రపద శుద్ధ చతుర్థీ బుధవారం

వినాయకచవితికి పూజాప్రతిమలు

— ఫొటో: ఎస్. రామకృష్ణ, మాయవరం.

# విషయానుక్రమణిక

ముఖచిత్రం : సాహిణీ వారి "అమర సందేశం" లో హేమాంగినిగా పద్మిని.








ఆరంభింపరు నీచమానవులు
విఘ్నాయాస సంత్రస్తులై;
యారంభించి పరిత్యజింతు
రురు విఘ్నాయత్తులై మధ్యముల్;
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్
ధృత్యున్నతోత్సాహులై;
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ
ప్రజ్ఞానిధుల్ గావునన్.

తా॥ విఘ్నములు సంభవించునను భయముచేత నీచమానవులు కార్యారంభము చేయరు. మధ్యరకమువారు పని ప్రారంభించి విఘ్నములు వచ్చినప్పుడు ఆ పనిని పరిత్యజిస్తారు. ధీరులైనవారు ప్రజ్ఞానిధులు గనుక తాము విఘ్నములచేత బాధింపబడినప్పటికీ, ధైర్యోత్సాహములు మరింత హెచ్చినవారై తాము ఆరంభించినదానిని విడిచిపెట్టరు.

ఆరంభశూరత్వం అనేది ఆంధ్రుల సొమ్ము అని అపహాస్యం చేయడం అలవాటైపోయింది అశేషజనానికీ - ఎందుచేత యీమాట అనవలసివచ్చిందో, ఎందుచేత యీమాట ఆంధ్రులు పడవలసివచ్చిందో తరచి చూచి పరువునష్టం దావా దాఖలు చేయవలసి ఉంటే దాఖలుచేసి వాదించి యీ అపవాదం రద్దుచేయించుకోవడం మంచిది. ఆంధ్రుల పుట్టుపూర్వోత్తరాలు సాకల్యంగా సమగ్రంగా సర్వతోముఖంగా సాంగోపాంగంగా శాతవాహన రాజుల కాలంనుంచి త్రవ్వి చూడవలెనంటారా? అందుకు తగిన చరిత్ర రికార్డు ఉంది. బౌద్ధమతం భారతదేశంలో తలఎత్తిన పిమ్మట బౌద్ధమతాన్ని అభిమానించి ఆహ్వానించి దక్షిణదేశానికి తీసికొనివచ్చింది ఆంధ్రులే. కృష్ణానదీ ముఖద్వారంలోనుంచి ఎగువకు వస్తే అమరావతివద్ద ఉండే బౌద్ధస్తూపమును చూడవచ్చు. నాగార్జునకొండ శిల్పమును చూడవచ్చు - కృష్ణా జిల్లా అంతటను గుంటూరుజిల్లా అంతటను బౌద్ధుల ఆరామాలు చైత్యములు వెదజల్లినట్లుగా ఉన్నాయి. బౌద్ధమతం అనే ఒక నూతన తత్వసిద్ధాంతము కన్పించేసరికి దానిని అనుసరించి ఆదరించి అభిమానించడానికి ముందడుగు వేశారు ఆంధ్రులు. పశువులను హింసించి యజ్ఞయాగాది కర్మలు చేయడం అక్రమం అని బౌద్ధధర్మం బోధించింది. ఈ అహింసా తత్వంలో సత్యం ఉన్నదని గ్రహించినవాడు ఆంధ్రుడు. అది వేదకర్మలకు విరుద్ధంగా ఉన్నప్పటికీ ఆ బౌద్ధమతాన్ని ఆంధ్రుడు గర్హించలేదు. అహింసా ధర్మంలో సత్యం ఉన్నదని గ్రహించిన ఆంధ్రుడు సత్యానికి నిలువబడ్డాడు. తన పూర్వమతం అంతటితో గతం గతం అన్నాడు. "వేదమతం" పేరుచెప్పితే "డామిట్!" అన్నాడు. నాగార్జునాచార్యులు బౌద్ధధర్మం సాధకంచేసిన యోధుడు. బౌద్ధమతానుష్ఠాన విధానంలో అదివరకుఉన్న హీనయాన విధానమును రూపుమాపి, మహాయాన విధానమును ప్రచారంచేసి ప్రసిద్ధుడైనాడు. బౌద్ధమతాన్ని అవలంబించినవాడు బౌద్ధసన్యాసి కానక్కరలేదన్నాడు. గృహస్థులుగానేఉండి బుద్ధుణ్ని ఆరాధించవచ్చునన్నాడు. బుద్ధభగవానుని ఉపదేశాలు ఉపనిషత్తులవంటివన్నాడు. వివాహాది కర్మకాండలకు బౌద్ధమతంలో కూడా కొన్ని మంత్రతంత్రాలు ఉండాలన్నాడు. ఈవిధంగా సర్వసంగపరిత్యాగం చేసి ఆంధ్రు లందరూ శుద్ధబుద్ధావతారాలు కాకుండా కట్టుదిట్టం చేశాడు. కొత్త బౌద్ధమతాన్ని పాత తత్వానికి అనుగుణంగా సంస్కరించినవాడు ఆంధ్రుడు.

సంస్కరణ అంటే పాతపద్ధతులలో మార్పుచేయడం కాదు. కొత్త పద్ధతులనూ, కొత్త సిద్ధాంతములనూ పాత సంప్రదాయాలకు అనుగుణంగా అన్వయించి అతికించడమే సంస్కరణం. క్రొత్త నీటికీ, క్రొత్త గాలికీ మన పాత శరీరాన్ని అలవాటు చెయ్యడమే సంస్కరణం. బుద్ధదేవుణ్ని కూడా మన విష్ణు అవతారాలలో చేర్చాము. ఏసుక్రీస్తు మతం మనకు క్రొత్తగా దిగుమతి

ఆగస్టు 27 తేదీన
ఆంధ్రదేశమంతటను విడుదల



నరసు స్టూడియోస్ వారి

# రాజగురువు

మాటలు - పాటలు
దేవులపల్లి కృష్ణశాస్త్రి

పూర్ణా రిలీజ్

G.H.RAO

# ★ కాలక్షేపం ★

అయినప్పటికీ, ఏసుమతం మనంఅవలంబించి నప్పటికీ ఏకాదశీ ఉపవాసం ఎందుకు ఉండకూడదు? ద్వాదశిపారణ ఎందుకు చేయకూడదు? ఏసుక్రీస్తు లీలలన్నీ యక్షగానంగా వ్రాయకూడదా? క్రీస్తు కథను హరికథగా చెప్పకూడదా? ఏసునామ అష్టోత్తరశతం తయారుచేసికొని పూజ చేయకూడదా? జాన్ అని పేరు పెట్టితేమాత్రం ఆ పేరునే జానయ్య అని ఆంధ్రీకరించకూడదా? డానియేలు అనేపేరు మనవ్యవహారభాషలో "ధనియాలు" కాకూడదా? మిస్టర్ ఆనందం మిస్టర్ ఆశీర్వాదం మిస్టర్ జ్ఞానమూర్తి అనేవి క్రయిస్తవుల పేర్లుమాత్రమే అవుతాయా? జకరయ్య అనేది శంకరయ్య కాకూడదా? ఫ్రెడెరిక్కుగారు అనేది "పెదరెక్కలు" గారు అంటేనే తెనుగు నోటికి వాటంగా ఉండవచ్చు. మత్తయిసువార్త మత్తేభాలతో పద్యకావ్యంగా వ్రాస్తే, మత్తయిసువార్త మరింత ఉత్తమ సువార్త అవుతుంది. సైయను శతకం తెనుగులో వ్రాస్తే అది మన సాహిత్యానికి సైతాను కాదు. మద్రాసు నగరంలో "హామిల్టన్" అనే దొరగారి పేరుతో "హామిల్టను వంతెన" అనేది ఒకటి చాలా కాలంక్రిందట నిర్మించారు. కొంతకాలం వరకు దానిని హామిల్టను వంతెన అన్నారు. కాని ప్రాంతీయప్రజల నోటిలో ఆ పేరు నలిగిపోయి "హామిల్టన్" అనే శబ్దం ఆఖరుకు "అంబట్టన్" అయింది. "అంబష్ఠ" అంటే సంస్కృతంలో మంగలివాడని అర్థం. అరవంలోకూడా అంబట్టన్ అంటే మంగలి అని అర్థం. ఆవిధంగా హామిల్టన్ వంతెన మంగలివాని వంతెనగా మారింది. దానిని తిరిగి ఇంగ్లీషులోకి తర్జుమా చేశారు. లోకులు పలుగాకులు. దానినే బార్బర్స్ వంతెన (*Barber's Bridge*)అని ఇప్పుడు మ్యునిసిపాలిటీ లెక్కలలోకూడా వ్యవహరిస్తున్నారు. ఈవిధంగా "శబ్దసిద్ధి లోకంబు వలన జెలియును" అనే చిన్నయసూరిగారి వ్యాకరణసూత్రం అనేక విషయాలలో అన్వయిస్తోంది.

ఆంధ్రలోకం అంటే ఆంధ్రులే - ఆంధ్రునకు ఏ క్రొత్తవిషయం, ఏ క్రొత్త తత్వం, ఏ క్రొత్తసిద్ధాంతం, ఏ క్రొత్త మతం కన్పించినప్పటికీ, దానిని ఆకర్షించి, ఆహ్వానించి, అన్వయించుకొని జీర్ణించుకునే శక్తిఉంది. అంబలిఏరు వరదగా వచ్చినప్పటికీ కొలబుర్ర అత్తగారిచేతిలోనే ఉన్నదన్నటుగా ఆంధ్రుడు తన పాత కొలబుర్రతోనే క్రొత్తసిద్ధాంతాలను క్రొత్తతత్వాలను కొలిచి తనలెక్కకు వాటిని సరిపుచ్చుకుంటాడు. క్రొత్తతత్వం ఏదైనా సరే, తన పాత బుర్రలోకిఎక్కించి, క్రొత్త తత్వాన్ని తన బుర్రకు అనుగుణంగా మార్చుకొని సంస్కరిస్తాడు.

బౌద్ధమతాన్ని ఆహ్వానించి జీర్ణంచేసికొన్న ఆంధ్రులే, ఆ పల్నాటి సీమలోనే, రోమను కాథలిక్కు క్రయిస్తవమతాన్ని తమలో జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణంఅన్నారు. మన నోములు వ్రతాలు విడిచిపెట్టకుండానే మరియమ్మను ఏసుక్రీస్తును ఆరాధిస్తున్నారు. మహమ్మదుయొక్క మతం వచ్చినప్పటికీ, "రాముడే రహీం" అన్నారు ఆంధ్రులు. రామదాసుగారి గురువు "కబీరు." తెలింగాణాలో మహమ్మదీయ మతం మదీయ మతమే అన్నట్లుగా హిందువులూ ముసల్మానులూ ఏకమై సమష్టి పాకంలోకి వచ్చారు. అల్లా పేరుతో అల్లోపనిషత్తు తయారుచేస్తే తెల్లబోయింది లోకం. శ్రీ సాయిబాబాకు యీరోజున విష్ణు సహస్రనామాలతో ఆయన సమాధి వద్ద హిందువులూ మహమ్మదీయులూ కలిసి ఆరాధన చేస్తారు. ఆ పూజానంతరం నివేదింపబడిన ప్రసాదాన్ని హిందువులూ మహమ్మదీయులూ కళ్ళకద్దుకొని కమ్మగా కలిసిమెలిసి ఆరగిస్తారు. హైద్రాబాదు నవాబుగారు భద్రాచల రాములవారి కల్యాణమునకు కానుకలు ప్రతి శ్రీరామనవమికీ నిత్యవిధిగా పంపించే రివాజు ఏర్పాటయింది.

బ్రహ్మసమాజం వచ్చిందంటే దానికి బ్రహ్మరథం పట్టింది ఆంధ్రలోకం. "బ్రహ్మకృపాహి కేవలం" అని బ్రహ్మపురి (బరంపురం) మొదలుకొని చెన్నపురి వరకు బ్రహ్మసమాజములను ఆంధ్రులు స్థాపించారు. వీరేశలింగం పంతులుగారు యజ్ఞోపవీతం కూడా "బ్రహ్మ కృపాహి కేవలం"అని తీసివేశారు. వితంతు వివాహాలకు అది అడ్డంరాదని ఆయన అనంతరం ఆంధ్రలోకం గ్రహించింది. బ్రహ్మసమాజ వివాహాలు కాకుండా, అగ్నిహోత్ర సాక్షిగా వేదమంత్రయుక్తంగా యీనాడు విధవా వివాహాలు యథావిధిగా ఆంధ్రులు చేస్తున్నారు. ఆంధ్రులకుగల బ్రహ్మాండమైన జీర్ణశక్తివల్ల బ్రహ్మసమాజాన్ని కూడా ఆంధ్రులు సులభంగా జీర్ణం చేసుకున్నారు. ఆంధ్రుల ఆత్మసంస్కారానికి అందువల్ల విఘ్నము ఏర్పడిందనేవాళ్ళు అసలు సంస్కారం అంటే ఏమిటో, దాని ఆకార మేమిటో స్వరూపం ఏమిటో తెలియని వాళ్లని తెలియజెప్పవలసి వస్తుంది.

విఘ్నం అనేది ఆంధ్రుల ఆత్మసంస్కార వికాసానికి అప్పుడప్పుడు కలిగినదని చెప్పడానికి వీలులేదు. అరవవారితో కలిసి ఆంధ్రులు ఉన్నందువల్ల అనేక గుణపాఠాలు నేర్చుకొన్నారు. మద్రాసులో ఉభయులకూ జాయింటు ప్రభుత్వం ఉన్నంత కాలమూ నేటి ఆంధ్రరాష్ట్రంలోని ఆంధ్ర జిల్లాల రాబడిలోనుంచి అనగా సర్కారు రెవిన్యూలో నుంచి సాలుకు కోటి రూపాయీలవరకు అరవజిల్లాలఅభివృద్ధికి వినియోగమవుతూ ఉన్నట్లుగా ఆంధ్రప్రముఖులైన కీ॥ శే॥ వేమవరపు రామదాసు పంతులుగారు లెక్కలు తయారుచేసి చూపించారు. రెండుకోట్ల ఆంధ్రుల సొమ్ము ఒక కోటి రూపాయల చొప్పున ఏటేటా హరించిపోతోంది అంటే ప్రతిఆంధ్రుడూ మనిషి 1 కి అర్థరూపాయి చొప్పున అరవజిల్లాల అభివృద్ధికి అర్పించి, ఆ గురుదక్షిణతో అనేక గుణపాఠాలను ఆంధ్రుడు "ఆచార్య దేవోభవ" అని నేర్చుకున్నాడు. నిన్నమొన్నటి వరకూ రాజగోపాలాచారిగారు ఆంధ్రరాష్ట్రం విడిపోవడం ఆంధ్రులకు శ్రేయస్కరం కాదనీ, భాషారాష్ట్రఘోష దుర్భాషయనీ వాదించారు. ఆంధ్రరాష్ట్రంకోసం ఆంధ్రుడు ఉద్యమం సాగిస్తే ఎప్పుడో రావలసిన ఆంధ్రరాష్ట్రం యిప్పుడు 40

మేనేజరు గుమాస్తాని పిలిచి అసిస్టెంటు మేనేజరు ఏం చేస్తున్నాడని అడిగాడు.

"భార్యతో ఫోనులో మాట్లాడుతున్నా"రని చెప్పాడు.

"భార్యతోనేనని నీకెలా తెలుసు?"

"అరగంటనుంచీ మాట్లాడుతున్నా 'ఊఁ!' 'అవును' అనే కాని మూడోముక్క ఆయన నోటివెంట రాలేదు; అంచేత!"

ఏళ్ళకు వచ్చింది. సైమనుకమిటీ వచ్చిన దినాలలో ఓఢ్రులకు ఊడిపడింది ఒరిస్సా రాష్ట్రం. ఆంధ్రరాష్ట్రంకూడా అప్పుడే అడిగితే అవలీలగా అవతరించేది. రమారమి 13 ఏళ్ళ క్రిందటనే మనకు రావలసినదీ రాష్ట్రం. ఇంటి ముందుకు వచ్చినదానిని కాలితో తన్ని వేసుకున్నామన్నారు. "సిరి రా మోకాలొడ్డ నేల?" అన్నారు. కాని, గాంధిమహాత్ముని ఆశీర్వాదం లేకుండా ఆంధ్రరాష్ట్రం అక్కర లేదన్నాము. స్వరాజ్యం వచ్చేవరకు బ్రిటిష్‌వారిని ఆంధ్రరాష్ట్రం కోసం "దేహీ" యని "పాహీ" యని యాచించవద్దన్నారు కాంగ్రెసు నాయకులు. కనుక, అటువంటి సందర్భంలో మనము మన కాంగ్రెస్ దీక్షాశక్తిని విరమించి ఆంధ్రరాష్ట్రంకోసం సైమను కమిటీతో సరస సల్లాపములాడినట్లయితే, మన కాంగ్రెస్ పతిభక్తి భంగమైపోయేది. మన కాంగ్రెస్ పాతివ్రత్యానికి విఘ్నం వచ్చేది. పాతివ్రత్యానికి లోపం లేకుండా, విఘ్నం రాకుండా, అభీష్టార్థములను పొందిన వాళ్ళం మనం. కాని, వ్రతం చేసినా ఫలం దక్కవలెనని ప్రవర్తించే వాళ్ళం కాము. ఇదే ఆంధ్రుల తత్వం. విఘ్నాలు వస్తాయనే భయం ఆంధ్రరక్తంలో లేదు. తుపాకీ కత్తి మొన చూపిస్తే తన రొమ్ము చూపిన వాడే ఆంధ్రకేసరి. తుపాకులు బారుచేసినా ఫిరంగులు బారుచేసినా పల్నాటిలో ఆంధ్రసత్యాగ్రహులు పరుండి ప్రాణాలిచ్చారుగాని పరువెత్తి పారిపోలేదు. బార్డోలీలో పన్నుల నిరాకరణ ప్రారంభిస్తే గుంటూరు జిల్లాలో వెన్వెంటనే పెదనందిపాడు ఫిర్కాలో పన్నుల నిరాకరణ ప్రారంభించారు. క్విట్ యిండియా తీర్మానం అమలుపరచడానికి ముందంజ వేసింది ఆంధ్రదేశం. దానినే 1942 అగస్టు అల్లరులన్నారు. ఈ అగస్టు అల్లరులకు కాంగ్రెసువాదులే కారణభూతులని ఆనాటి ఢిల్లీ ప్రభుత్వ సభ్యుడైన టాటెన్హాంగారు చాటించారు. ఆంధ్ర కాంగ్రెసు ప్రముఖులు తయారు చేసిన విప్లవకార్యక్రమమే దేశమంతా అనుసరించిందని టాటెన్హాం ఘాటుగా చాటుగా ఒకమాట అక్షరాలా అన్నాడు. తెనాలిస్టేషను ఆనాడు తెలుగు సీమలో దివ్యజ్యోతిగా ప్రజ్వలించింది. ఫిరంగి అంటే, శతఘ్ని అంటే జడియని తెలుగుజాతికి విఘ్నం అంటే భీతి ఏరీతిగా ఉంటుంది? విఘ్నములు వస్తాయనే భయంతో విఘ్నేశ్వరుణ్ణి ఆంధ్రుడు ఆరాధించడు. భయంతో గడగడలాడుతూ గజాస్యుని కొలిచే తత్వం ఆంధ్రత్వంలో లేదు. భక్తితో ఏపని చేయమంటే, ఆపని చేస్తాడు ఆంధ్ర పుత్రుడు.

గణపతికి మొక్కని ఆంధ్రుడు ఉండడు. గాణాపత్యంలో ఆంధ్రులకున్న విశ్వాసం గణనాతీతం. ఒక్కొక్క గణమునకు ఒక్కొక్క నాయకుడు ఉండవచ్చు. బహు నాయకత్వంలో బహుమానం పొందదగినవాళ్లు ఆంధ్రులని బహుకాల పరిహాస వాక్యం ఒకటి పరిపాటిగా ఉంది. కాని, ఎన్ని పార్టీలు ఉంటే అన్ని నాయకత్వాలు ఉండకమానవు. పార్టీ ప్రభుత్వపద్ధతి అనేది ప్రజాస్వాతంత్ర్యం ఉన్నంతకాలమూ ఉండవలసిందే. ప్రజలు స్వతంత్రంగా రాజకీయ వ్యవహారాలు ఆలోచించగల సమర్థులైనప్పుడే అనేక స్వతంత్రాభిప్రాయాలు ఏర్పడతాయి. వివిధ స్వతంత్ర రాజకీయ సిద్ధాంతాలతో వివిధ రాజకీయ పక్షాలు ఏర్పడతాయి. వివిధ నాయకత్వంతో వేర్వేరు జనసంఘములు వేర్వేరు గణములుగా వడివడిగ విడివడి పోవడంలో వింతలేదు. ఆయా జనగణములు ఆయా గణనాయకుల ననుసరిస్తూ ఉంటాయి. ప్రజలలో రాజకీయ జ్ఞానప్రబోధం ఎక్కువైనకొలదీ, స్వతంత్ర రాజకీయ పక్షములు వృక్షశాఖలవలె విస్తరిస్తాయి. ప్రజాస్వాతంత్ర్య వృక్షము విస్తరించి వికసించినప్పుడే జనగణశాఖలు వేర్వేరు పక్షములుగా ప్రవర్ధమానమౌతాయి. కనుక, ఆంధ్రజాతిలో యీ బహునాయకత్వం అప్రయోజకత్వం కాదు. చేవకలిగి కోవగా పెరుగుచున్న ప్రజాప్రబోధం యీ బోధి వృక్షమని బుద్ధిమంతులు గ్రహించాలి. ప్రజాస్వాతంత్ర్యం వర్ధిల్లాలంటే, గణనాయకోపాసన వృద్ధి కావాలి. గణనాయకుని యందు భక్తి లోపించకుండా పత్రి లోపించకుండా పూజలు జరగాలి. పెట్టెలు నిండిన వోటుపత్రాలే గణనాయకునకు సర్వత్ర

రచయిత: మీ విమర్శ చూస్తే నా కథ శీర్షిక మీకు నచ్చలేనట్లుంది.

విమర్శకుడు: కాని నా ఉద్దేశ్యం ఆ శీర్షికలో చాలా అందమైనది.

రచయిత: మరైతే విమర్శలో అట్లా వ్రాశారేం?

విమర్శకుడు: అంత అందమైనశీర్షిక మీ చేతిలో పడి చిత్రవధ అయిందే అని బాధ!

— కె. పి. రావు, ఏలూరు.

ప్రీతికరం-ప్రజాస్వాతంత్ర్యాధిష్ఠానదైవం గణాధిపతి.

"జనగణ మన అధినాయక"

అని భక్తితో పాడగల ప్రతి భారతీయుడూ గణనాయకుని స్మరిస్తున్నాడని గ్రహించాలి. ఇంటి కొక గణనాయకుడు వెలసినా మనకు భయం లేదు. ఎందుచేతనంటే, మన భారత ప్రజాస్వాతంత్ర్యానికి ఒకటే జెండా. దేశం ఏనుగంత పెద్దది కావచ్చు. భాషారాష్ట్రాలు ఎన్ని వెలసినా ద్వైతభావాలు ఏర్పడవు. "ఏకదంతం మహాకాయం" అనేది మన భాషారాష్ట్ర తత్వవేదాంతం. ఒక్కటే జెండా క్రింద యింత భారీ భారతదేశం అంతా నిశ్శంకగా నిర్విఘ్నంగా, విఘ్నేశ్వరుడంటే కూడా భయంలేకుండా భక్తి ప్రపత్తితో సిరిసంపత్తితో చిరంజీవిగా ఉంటుంది.

ఆరంభిస్తే విఘ్నాలు వస్తాయనే భయంతో ఆరంభించని పిరికిపందలు కారు ఆంధ్రులు.

"జనగణ మన అధినాయక జయహే" అనే భక్తితో దేశభక్తితో గణనాయకోపాసన చేసేవాళ్లు ఆంధ్రులు. శతఘ్ని అంటే భయంలేనివారికి విఘ్నం అంటే లెక్క లేదు. అందువల్లనే ప్రారంభించిన ఉద్యమాన్ని విరమించరు. ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్. ★

# రాజీనామా

ఆఫీసునుండి మాంచి విసురుమీద ఇంటికి వచ్చిన రామారావు ఒక్కసారి చల్లబడిపోయి పిల్లిలాగ గప్‌చిప్‌గా ఇంట్లో ప్రవేశించాడు... రాత్రి భోజనాల సమయందాకా ఎవరికీ కనబడకూడదనుకున్నాడు. వీలయితే భోజనం తండ్రిగారికంటె ముందయినా తరువాతయినా కానిచ్చేసి, మరునాటి వుదయందాకా ఆయనకసలు కనబడకూడదనుకున్నాడు. కాని అదేం ఖర్మమో, ఇంట్లో అడుగుపెట్టగానే సావిట్లో పచార్లుచేస్తో ఆయనే కనబడ్డారు! ఈ సమయంలో ఆయనా ప్రదేశంలో సాధారణంగా వుండరు. బుర్ర వంచేసుకుని, ఊఁ ఆఁ అనకుండా నెమ్మదిగా మేడమెట్లెక్కాడు. ఇతనిలా ఇంట్లో దూరిన వరసనిబట్టి ఎక్కడో చిచ్చుముట్టుకుందని శివయ్యశాస్త్రిగారి కనుమానం వేసింది. లేకపోతే వా డిలా వుండడు.

"ఏమిట్రోయ్ కథా కమామీషు? అలా తయారయావ్?" అన్నారు. రామారావు గతుక్కుమన్నాడు. ఒక్క అరసెకండాగి మళ్ళా ముందుకిసాగాడు. వీడాఫీసులో ఎవడితోనో దెబ్బలాట పెట్టుకున్నాడు. అందుకు సందేహం లేదు. "ఊఁ. అయితే ఉద్యోగం వదిలేసేవన్నమాట. ఇలాంటి పనేదో చేస్తావని, నే ననుకుంటూనేవున్నా." రికార్డు టైములో ఎక్కిన మెట్లన్నీ రెండంగలలో క్రిందకి దూకి తండ్రిగారిముందు నిలబడ్డాడు.

"మీ కెలా తెలిసింది?"

"ఛా, అదేం ప్రశ్న? నీకంటె ముప్ఫయి సంవత్సరాలు ముందు పుట్టానన్న సంగతి మరిచిపోకు. నీవాలకాన్నిబట్టి ఆమాత్రం గుర్తించలేనూ? ఇంతకీ అసలు జరిగిందేమిటి?" తనకంటె ముప్ఫయ్యేళ్లు ముందు పుట్టడంవల్ల, ఆయనివన్నీ ఎలా వూహిస్తున్నారో రామారావు కర్థంకాలేదు. ఇది మొదటిసారికాదు; ఎదుటి వాడిముఖకవళికల్నిబట్టి జరిగిందాయన వూహించేయడం.

"నన్ను మామేనేజరు ఫూల్ అన్నాడు."

"అంటే నువ్వేమన్నావు?"

"నేనేనేమిటి అంత తక్కువ తిన్నవాడిని? 'నేనుఫూల్నయితే నీవు మూడింతలు ఫూలువి. నీ ఆఫీసులో పనిచేస్తున్నాను కదా అని నీ ఇష్టం వచ్చినట్లు వాగితే సహించను. సభ్యతకోసం వెనుకా ముందులాలోచిస్తున్నా కాని లేకపోతే నా... ఇదిగో నా రిజిగ్నేషన్' అని ఆ కాగితం వాడి ముఖాన్ని కొట్టి చక్కా వచ్చాను".

"మంచిపని చేశావు. నా కొడుకుని నానా మాటలన్న దౌర్భాగ్యు డెవడు? సభ్యత, గిభ్యతా, వాలకి నెట్టి డొక్క చీల్చి ఎండబెట్టి రాకపోయావ్?" అంటూ చాలా తీక్షణంగానే చెప్పారు. అప్పుడే బయటికి వచ్చిన సీతమ్మగారు. "ఇంకనేం? ఆ వీరపుత్రుడిని కన్నదా వీరమాత! ఇప్పుడు మాత్రం మించిపోయిందేమీ లేదు. ఇద్దరూ కలిసి ఆ పని కాస్తా పూర్తి చేసేరండి. వాడీ వూళ్లో నే వుంటా డెక్కడో అక్కడ అన్నారు."

"మీకు బాగా వేళాకోళంగా వుంది."

యం. యస్. ప్రకాశరావు

"వాడిని తన్నడం విషయం తరువాతాలోచిద్దాం. వాడిని నువ్వెందుకు ఫూలన్నావ్?"

"మరి నాకంతకోపం వచ్చింది." రామారావు చిన్నపిల్లవాడిలా ఫీలయాడు. తను చేసింది కొంపతీసి తప్పేమో. లేకపోతే నాన్నగారంత ఆరాలు తీయరు. తను సరయిన పని చేస్తే, "అయిపోయిందేదో అయిపోయింది. ఆ విషయం మర్చిపో" అని ఒక్క నిమిషంలో తేల్చేస్తారు. ఇలాంటి సంభాషణ తను తప్పు చేసినప్పుడే జరుగుతుంది. చిన్నపిల్లాడిలా తాను చేసిన పని సమర్థించుకుంటున్నాడు.

"నీకంత కోపం వచ్చింది కనుక అతన్ని మూడింతలు ఫూలనడమే కాకుండా, డొక్క చీరేస్తానని హామీ కూడా ఇచ్చావు. మరి నిన్న తను ఫూలెందు కన్నాడో?"

ఇంక లాభంలేదు. జరిగిందంతా చెప్పెయ్యాల్సిందే.

"నాలుగు రోజులక్రితం 'స్నేక్ పేక్ అండ్ పేకిస్నేకి' వారి ఆఫీసుకి పోయి ఏదో పనిచేసుకుని రమ్మన్నాడు. నే వెళ్లిన పని అవలేదు. దానికోసం, ఆరేండ్లనుండి నేను శ్రమపడి చేసిందంతా మర్చిపోయి, ఎఫిషెన్సీనిగురించి, దాన్నిగురించి, దీన్నిగురించి, వాగడం ప్రారంభించాడు. నే నేదో సమాధానం ఇచ్చాను. చివరికి వాదం పెరిగి, 'మీరింత ఫూలని నే నెప్పుడూ అనుకోలే' దన్నాడు. నాకు వొళ్ళు మండింది."

"ఓరి కుర్రకుంకలూ, ఈ మాత్రానికే ఇంత రాద్ధాంతం?"

"ఇదొకటే కారణం కాదులెండి. రోజూ ఆఫీసులో ఎవర్నో ఒకరిని వేపించుకుని తింటాడు. నా కసలే వొళ్లుమంటగావుంది. ఈవాళ నన్నూ ఆవిధంగానే ట్రీట్ చేసేసరికి నాలుగూ అంటించేసి వచ్చేశాను."

"నీవు చేసింది మంచిపని కాదురా, ఇద్దరూ కోపాతిశయంలో ఏదో అనుకున్నారు. మామూలు పరిస్థితులలో అలా జరిగివుండేది కాదు. ఈ కోపమనేది మానవుడికి పెద్దశత్రువు. అది మనిషిని పశుప్రాయుణ్ని చేసేస్తుంది. ఆ సమయంలో వివేచనా జ్ఞానం నశిస్తాయి. అందుచేతబ్బాయీ, కోపంలో ఎవడయినా ఏదైనా చేస్తే వాడి పతనానికి సానుభూతి చూపించాలిగాని, ఆగ్రహించకూడదు."

"ఎదుటివాడన్న మాటలు మింగేసి, చివరకి థేంక్స్ అని చెప్పి వచ్చేయడం నా శక్తికిని మించింది."

"ఎదుటివాడన్న మాటలన్నీ మింగి చివరకి థాంక్సని రావడంకాదు. ఎదుటివాడు మాటలు మింగించడం ప్రారంభించేసరికే, థేంక్స్ అని బయటికి పోవాలి. తాత్కాలికంగా అదా వ్యక్తికి కొంచం షాక్ కలిగించినా, చివరకి బుర్ర చల్లబడ్డాక, ఆ పని కెంతయినా మెచ్చుకుంటాడు—సహృదయుడయిన ఆఫీసరయితే."

"మావాడేమీ అంత సహృదయుడుగా మాకు కనబడటంలేదు. చూడండి, కొందరి వ్యక్తుల కేమవుతుందంటే, వాళ్ళ హోదా పెరిగినట్లు హృదయంకూడా పరిపక్వం పొందదు. దాంతో క్రిందవాళ్లని ఏడిపించడమే ఎడ్మినిస్ట్రేషనని తప్పు అభిప్రాయంతో కొట్టుకుంటూ వుంటారు. మా వా

డా బాపతుకి చెందినవాడని మా అందరి దృఢవిశ్వాసం."

"ఎవరు సత్యనారాయణ? అతను తాసిల్దారు కృష్ణారావుగారి కొడుకు కాదూ? ఆయన తాసిల్దారుగా వున్నప్పుడు నే సెకెంటుగా వుండేవాడిని. మా ముప్ఫయి ఏళ్ళ సర్వీసులో ఒక్కసారి దెబ్బలాడుకోలేదు. పల్లెత్తుమాటనుకోలేదు. ఆ రోజులు తిరిగి రావు. ఊఁ. అయిందేదో అయింది. ఇంక ముందేం చేస్తావు?"

"ఇంకా ఆలోచించలేదు. కాని ఇంకోచోట ఎక్కడయినా ప్రయత్నం చేద్దామనుకుంటున్నా."

"ఆఁహాఁ, ఇంకోచోట ఉద్యోగం చేయాలనివుందా? అక్కడింతకన్న అధ్వాన్నంగా వుండదని నమ్మకమేమిటి? అసలు నౌఖరి అంటేనే ఇంత. కాని మనబ్బోటి కుటుంబీకుల కిది గట్టిగా జీవసేసి అంటించబడింది. లేకపోతే జరగదు. అందుచేత అభిమానాలు అవీ భూతికొలని మూలకి నెట్టేసివుంటే, అధమం మానసిక శాంతి అయినా లభిస్తుంది. వాటిని గురించి ఆలోచిస్తున్నకొలది మన పరిస్థితికి కృంగిపోవడం తప్ప వేరే లాభంలేదు. అక్కడ వుద్రేకంలో ఏదో జరిగింది. ఇప్పుడు ప్రశాంతంగా ఆలోచించుకో. నీవు చేసింది మంచిదని నీకుతోస్తే, జరిగినదానికి విచారించకు. ఇదిపోతే ఇంకో వుద్యోగం వస్తుంది." అని శాస్త్రిగారు కండువా వేసుకుని బయటకి పోయారు.

రామారావుకిప్పుడు నిజంగానే బుర్ర పోయింది. నాన్నగారే ఏదో వొకటి తేల్చి చెప్పేస్తే ఎంతయినా బాగుండేది. ఆయనెప్పుడూ ఎవరికీ తప్పు సలహాలు ఇవ్వడం తనూ చూడలేదు. ఇలాంటి పరిస్థితులలో బీచికిపోయి, ఒంటరిగా వోమూల ప్రశాంతంగా ఆలోచించడం మంచిది. కాని రామారావుకా భాగ్యం దక్కలేదు. ఇంటినుండి రెండడుగులు వేశాడో లేదో, వోమూలనుండి సుబ్బారావు, ఇంకోమూలనుండి వెంకటేశ్వర్లూ వూడిపడ్డారు. ప్రపంచంలో ఎవర్నయితే యీవాళ కలవకుండా వుందామనుకున్నాడో వాళ్ళే వూడిపడ్డారు. భూమినుండి ఈ నమూనా వాళ్లని ఏరిపారేస్తే, భూలోకం ఇంతకంటె నందనవనంగా, ఆనందంగా వుంటుందని రామారావభిప్రాయం. ఇంక వీళ్లని తప్పించుకోడం అసంభవం. వీళ్లిద్దరూ చాలనట్లు శివరావు దొర్లుకుంటూ వచ్చేశాడు. వచ్చినవాడూరుకున్నాడా, "ఏమిగోయి కొకన్నాట్లూ, అలా తయారయావ్?" అని ప్రారంభించాడు. దీనికి సుబ్బారావు,



ఉజ్జయిని గణేశ్వరాలయంలో వినాయక విగ్రహం

ఫోటో: ఆర్. బుచ్చివీరయ్య—సికింద్రాబాదు.

వెంకటేశ్వర్లూ, "అప్రనోయి ఆసంగతి మేం కనిపెట్టలేద"ని ఒకడూ, "కడుపు నెప్పిగా వుందేరా" అని ఒకడూ, "కాఫీ మేమే ఇప్పిస్తాం లేరా" అని ఒకడూ, ఇలా ప్రారంభించారు. ఇంకోప్పుడయితే సావకాశంగా వినేవాడేమో కాని రామారావు ఈనాడా స్థితిలో లేడు.

"షటప్, నేను ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేశాను."

అది వాళ్లమీద బాంబులా విసరాలని రామారావు ఉద్దేశ్యం కాదు. కాని ఇంచుమించు అంతపనీ జరిగింది. "వాట్" అంటూ భూమికి సరిగ్గా ఆరంగుళాల ఎత్తయినా ఎగిరాడు సుబ్బారావు. "నీమాటలో రాజీనామా అనే పదం వినిపించినట్లుంది. బహుశః నేను పొరబాటు వినివుంటానులే" అన్నాడు వెంకటేశ్వర్లు.

"కాదు, నీవు సరిగ్గానే విన్నావు." అని అతి సీరియస్‌గా చెప్పాడు.

"కథ మొదటినుండి ప్రారంభిస్తేనే కాని మజా లేదు. ఇలా మధ్యలో పాఠకులు రాలు వచ్చేస్తే ఎలా? అందుకనే, ఏమిటి కథా,

# ★ రాజీనామా ★

కామామిషు? అంటారు పెద్దలు." అన్నాడు శివరావు. వీడిదగ్గరున్న రోగమే యిది. ప్రతీది అతి జాగ్రత్తగా పరిశీలించా లంటాడు. రామారావు జరిగింది చెప్పాడు.

"శహబాష్‌రా సోదరా. ఆంధ్ర పుత్రుడవు. మా పరువు నిలబెట్టావు. ఈవాళ నీకు కాఫీ ఇప్పిస్తాం" అని జబ్బ విరగ్గొట్టేశారా పేరసైటుద్వయం.

"అంతా బాగానే వుంది. కాని మా తాన్నగారు, నీవు చేసింది తప్పన్నారు కనుక అది తప్పే అయివుంటుంది. యీ ముసలాళ్లున్నారేం, వీళ్ళు చాలా నిజం మాట్లాడుతారు. ఒకసారి మా అమ్మమ్మేం చెప్పిందంటే—" అంటూ ప్రారంభించాడు శివరావు.

"అదుగో ప్రారంభించావురా మీ అమ్మమ్మ కబుర్లు." అంటూ కొరకొరా, చురచురా చూశారు మిగిలిన మిత్రత్రయం.

"అమ్మమ్మ కబుర్లంటే అంత వేళాకోళంగా వుందేమోయ్? ఈ ముసలివాళ్లు మనం చూడని భూతాన్ని, చూస్తున్న వర్తమానాన్ని చూశారు. ఎన్నో మార్పులను వాళ్ల జీవితకాలంలో చూశారు. అవన్నీ సమన్వయం చేసి, మంచి, చెడూ తెలుసుకోగలుగుతారు. ఇంతకీ నే చెప్పేది అడ్డు చెప్పక వినండి. భోజన సమయంలో ఉప్పు మా చేతుల్లో ఎవరేనా వేస్తే, మా అమ్మమ్మ తెగదెబ్బలాడేది. అలా వడ్డిస్తే, ఆ వడ్డించిన వ్యక్తి, వడ్డింపించుకున్న వ్యక్తి తన్నుకు చస్తారుట—"

"అబ్బబ్బ, నీ పురాణాలు వినే వోపిక నాకు లేదు. అందులో యివాళ అసలు లే"దన్నాడు రామారావు.

"ఓహో ఏమయిందనుకున్నారు—"

"ఏమోయ్, నీ చెవిలో పుండా? చెబుతూంటే వినవేం?? ఈ గొడవ—"

"నేను భోజనం చేస్తూ, ఎడమ చేతితో ఉప్పు తీసికుని కుడిచేతిలోకి వేసుకున్నా. నమ్మండీ, సరిగ్గా ఒక్క నిమిషం గడిచిందో లేదో, ఒక దోమ కుడిచేతిమీద వ్రాలడం, ఎడమచేయి లేచి, కుడిచేయిపైన ఒకేమారు వొకటివేయడం జరిగింది! దోమయితే ఎగిరి పోయింది, కుడిచేయిమాత్రం కందిపోయి మంటెక్కిపోయింది."

అంత సీరియస్ మూడ్‌లో వుండీకూడా, నవ్వకుండా వుండలేకపోయాడు రామారావు. ఇదయ్యాక నలుగురూ, మూడేసి కప్పులు కాఫీ అరేసి గ్లాసులు నీళ్లు, రెండు పెట్టెల సిగరెట్లతో ముందేం చేయాలో ఆలోచించారు.

"వాడు నిన్ను ఫూలన్నందుకు క్షమాపణ పత్రం ఇచ్చుకుంటే నీవు తిరిగి జేరిపోరా" అని ఒక్కనిమిషంలో అతిసులభంగా సలహా ఇచ్చేశాడు సుబ్బారావు.

"ఏడిశావు లేవోయ్. వీడికి వాడిస్తాడనుకో. మరి వాడిని, వీడు మూడింతలు ఫూలన్నందుకు వాడికి వీడు మూడింతలు ఎపాలజీ యివ్వొద్దూ? పైగా వాడు బాస్. వాడు వీడి కెపాలజీ ఎందుకిస్తాడురా సుబ్బారాయుడూ?" అని ఆ వాదాన్ని తునాతునకలు క్రింద ఖండించేశాడు శివరావు. రామారావింక ఆలోచించడం మానేసి వాళ్ల చేతుల్లో పెట్టేశాడు. ఆరేళ్లందులో పనిచేశాక, క్రొత్తదాంట్లో ప్రవేశించడమంటే ఎలానోవుంది. ఆ వాతావరణానికి తా నలవాటు పడిపోయాడు. చివరికి చేయవలసినపని మిగతావాళ్లు నిశ్చయించి అతనికి తెలియజేశారు. దాని ప్రకారం, రామారావుని కనుక ఆ మేనేజరుగాడు అపాలజీ అడగకుండావుంటే, ఇతను తిరిగి ఉద్యోగంలో ప్రవేశించవచ్చు. వీళ్లని వదిలించుకోడానికి రామారావందు కంగీకరించాడు. కాని అది పనిచేస్తుందని రామారావుకి నమ్మకంలేదు. రేపు తను మామూలుగానే ఆఫీసుకి వెడతాడు. మేనేజరు కనుక తన తండ్రిగారన్నంతటి సహృదయుడైతే, కోపాతిరేకంలో జరిగినది మరచిపోయి, తనని తిరిగి అంగీకరిస్తాడు. తేలికపడ్డ హృదయంతో ఇంటికి జేరాడు.

* * *

సరిగ్గా ఇదే సమయానికి, నిక్‌నాక్ ఇన్సూరెన్సు కంపెనీ జనరల్ మేనేజరు సత్యనారాయణ తన ఇంట్లో దెబ్బతిన్న పులిలాగ వురుకుతున్నాడు.

"నన్ను ఫూలంటాడు? వాడంతర మేమిటి, నా అంతర మేమిటి? ఈడ్చి తంతే తినడానికి గింజలులేని కుంక, నోటికొచ్చిందల్లా కూస్తాడా?"

"ఏమిటోయ్, మీ అంతరాల్లో లేదా! నీతండ్రి తహసిల్దారుచేసి నాలుగురాళ్లు సంపాదించి నిన్ని మాత్రం చదివించి, పలుకుబడి వుపయోగించి వుద్యోగం వేయించాడు కనుక యీవాళ లీలావున్నావ్. కొందరు కొందరు పొరబాటున ఇంతవున్న తలిదండ్రులకి పుడతారు. అదంతా తమ ఘనతే అనుకుని మూర్ఖత్వంలో వుంటారు. స్వశక్తితో పైకివచ్చినవాళ్లు చాలా అరుదు."

"ఆc, పరిస్థితులను కూలిస్తేమాత్రం, తెలివితేటలు లేక అక్షరం అంటనివా రెంత మంది లేరు? అటువంటివాళ్లెంత ఆర్థికబలముంటే మాత్రం పైకి రాగలుగుతారా?"

"ఎందుకు రారు? తండ్రి తాతలు సంపాదించినదానితో దర్జాగా కారులో తిరుగుతారు. పెద్ద భవనంలో నివసిస్తారు. తెలివితేటలుండి, కష్టపడి పనిచేసి, వ్యక్తిత్వం నిలబెట్టుకున్న వ్యక్తి ఇవేమి లేకుండా క్రుంగిపోతున్నాడు. సరే యీ చర్చ ఇంకో రోజుకి వాయిదా వేద్దాము. ఇంతకీ ఆ కుర్రాడు పనెలా చేస్తాడు?"

"మా ఆఫీసులోకల్లా కష్టపడి పనిచేసేదతనొకడే - చాలా తెలివయినవాడు. అతనికి చేతకాని పనిలేదు. అందుకునే అతన్ని విసర్జించటం నా కంత మనస్కరించటంలేదు. అందుకే యీ ఆలోచనంతా."

"ఎఫిషెంటుగా పనిచేసే వాడికి కొంత మార్జిన్ వదిలెయ్యాలిరా అబ్బాయి. అటువంటివాళ్లని నానామాటలూ అంటే పడరు. ఎందుకంటే వాళ్లు సంపాదించే ప్రతి పైసా- పనిచేసి సంపాదిస్తున్నారు. అందులో ఎవరి మెహర్బానీ యేమీలేదు. మా ఎకౌంటెంటు శివయ్యశాస్త్రి, కత్తిలాంటి మనిషి - పనిలో దిట్ట, లంచాలు, గించాలూ అలా ముట్టేవాడుకాదు. ఒకటి రెండుసార్లు నేనా పాపపుపని చేశాను. అందుచే నైతికంగా అతనికంటే న్యూనత ఫీలయేవాడిని. ఒకనాడేమయిందో తెలుసా? నీలాగే నేనూ అధికారమదంలో అతన్నేదో అనబోయాను. చేతిలోని ఫైలు తక్కున బల్లపైన పడేసి వెళ్ళిపోయాడు. నాకు తగని కోపంవచ్చింది. కాని మరునాడతనే వచ్చి, 'మాపండి కృష్ణరావుగారూ, నిన్న మీరేదో అంటూవుంటే, నాకూ చాలా కోపంవచ్చింది. కోపంలో ఏమంటానో నాకే తెలియలేదు. అటువంటి

ప్రమాదం జరగకుండా నేనే వెళ్ళిపోయాను.' అప్పటికి నా కోపం తగ్గిపోయింది. హోదాలో తేడా వున్నప్పటికీ, వ్యక్తిగతంగా ఇద్దరం సమవుజ్జీలం. ఒక మెట్టెంకా నేనే తక్కువ. అప్పటినుండి మా మధ్య ఏ వివాదాలూ లేవు. ఇప్పటికీ ప్రాణస్నేహితులమే." అంటూ గతంలో మధురఘట్టాలని నెమరవేసుకున్నారు తాసిల్దారుగారు.

"ఆయన కొడుకే యితడు."

"మరి చెప్పవేం? ఆ తండ్రికి తగ్గ కొడుకు. శాస్త్రి కొంచెంముందు వెనుకలాలోచించేవాడు. ఇతనిది కొంచెం వుడుకు రక్తం. అయిందేదో అయింది. ఇంతాలోచన దేనికి? ఇంకో డొస్తాడు."

"అంతేలెండి. కాని ఇలాంటి వాడు దొరుకుతాడనుకోను. అయినా ఇలాంటి అసభ్యవర్తనం సహిస్తే ఆఫీసులో వొక్క నిమిషం పనిచేయలేం."

వీళ్ల సంభాషణిలా ఎంతసేపు సాగేదో కాని ఇంతలో శాస్త్రిగారే వచ్చారు. కొడుకు చేసినపనికి బహుశః క్షమాపణ చెప్పుకోడానికి వచ్చేడేమో ననుకున్నాడు మేనేజరు సత్యనారాయణ. కొడుకుని ఘోలన్నందుకు తనకొడుకు అంతు చూడటానికి వచ్చాడేమో ననుకున్నారు రిటైర్డు తాసిల్దారుగారు. తాను వచ్చిన పనేదో ఆలస్యంలేకుండా, ఉపోద్ఘాతంలేకుండా ప్రారంభించడం శాస్త్రిగారి అలవాటు. యీ కుర్రవాళ్ల దెబ్బలాట కనుక్కుపోదామని వచ్చారు. రామం కథవిన్నారు. ఇంక సత్యం కథవినాలని వచ్చారు. కుర్రాడి ననిపించుకోడం తన కిష్టం లేదన్నట్లు అదోలా చూచాడు సత్యం.

"అలా చూస్తే లాభంలేదు. నీకో నేకలో మేనేజరు గిరీ మాదగ్గరట్రా? కానీ యీ అసలు కథేమిటో." తండ్రిగారికి వ్యతిరేకంగా చెప్పడం సత్యానికి అలవాటులేదు. ఆయన తన తండ్రిగారికి మిత్రుడవుతే తానింక చేసేదేమీ లేదు. అందుచే జరిగిందంతా చెప్పాడు.

"మావాడూ అదే చెప్పాడు. తమ తమ పనుల్ని సమర్థించుకోడానికి అబద్ధాలు చెప్పారుకారు. చాలా సంతోషం. తప్పెవరిదయినా, వేరే దురుద్దేశాలు లేకుండా మా వాడె పాలజీ ఇచ్చుకుంటాడు." తండ్రి కొడుకు లిద్దరూ తెల్లబోయారు.

"మా వాడి ఉద్యోగం పోతుందని భయంతో యీ పని చేస్తున్నానని అనుకోకండి. నాకూ మీకూ వుండే స్నేహానికి కుర్రాళ్ల పనివల్ల భంగం కలుగకుండా వుండటానికి, వాళ్ళిద్దరిలోనూ ద్వేషబీజాలు లేకుండా వుండటానికి యీ పని చేయిస్తున్నా. పొరబాట్లందరూ చేస్తారు. కాని విజ్ఞులు వాటిని గుర్తించి సమర్థించుకోడానికి ప్రయత్నిస్తారు."

"సరే నాకేమీ అభ్యంతరం లేదు."

"ఒరేయ్ నీవు కాస్త వుండు. ఆయన భావం నీకర్థమయిందా? వేరే చెడుభావాలు లేకుండా అతనిచే అపాలజీ యిప్పిస్తామంటున్నారు. అంతేకాని నీచేత ఘోలనిపించుకున్నాక నీ ఆఫీసులో అతను పని చేస్తాడని కాదు. నాలుగురోజులయాక ఇంతకంటె మంచి పరిస్థితులలో అతను తిరిగి రాజీనామా ఇస్తాడు. అందుచే అపాలజీలూ వద్దూ, ఏదీ వద్దూ. ఏమీ జరగనట్లు గప్‌చిప్‌గా ఎవరిపని వారు చేసుకోండి."

"అలా అయితే ఇంక ఆఫీసులో మిగతా వాళ్ళచేత పని చేయించుకోలేను."

"అదే పొరబాటు. ఆఫీసులో పనిసాగాలంటే క్రిందవాళ్లని ట్రీట్ చేయడం ఆఫీసరుకి తెలియాలి. నీలాగే వాళ్లూ మానవులని గుర్తుంచుకుని, వాళ్ల మంచి చెడూ, కష్టం సుఖం చూస్తూంటే, వాళ్లు నువ్వంటే భయపడడం మానేసి, నిన్ను గౌరవిస్తారు, ప్రేమిస్తారు. కుర్రాడివి, ఇది గుర్తించివుంటే యింత రాద్ధాంతం జరిగేదికాదు."

"మరి మధ్యమధ్య ఏదో విసుగులో ఏదైనా అంటే, వాళ్లిలాగ నేనా పడవలసింది?" తండ్రిముందు ఇంత కుర్రాడిలా మాట్లాడినందుకు సత్యానికే ఆశ్చర్యం కలిగింది.

"మీ నాన్నగారనుభవంతో చెప్పారు. ఆయనన్నట్లు చేసిచూడు, ఇంత అల్లరి జరుగుతుందేమో?"

"సరేరా సత్యం, ఈవాళ జరిగింది మిగతావాళ్లకి తెలియాల్సిన అవసరంలేదు. నీకూ అతనికీమధ్య జరిగిన ఘర్షణ, ఆఫీసులో యింకెవరికి తెలిసివుండదు. అందుచే రేపు అతను ఆఫీసుకి రాగానే, ఏదో మామూలు ధోరణిలో పిలిపించి ఆ రాజీనామాపత్రం, అతని చేతులో పెట్టి, చిరునవ్వు నవ్వేయి. అంతా అయిపోతుంది. ఏమంటారు శాస్త్రిగారూ?" "అలాగే కానివ్వండి." ఆ రాత్రి కొడుకుతో యీ ప్రసంగం తీసుకు రాలేదు శాస్త్రిగారు.

మర్నాడు ఆఫీసులో మేనేజరు తన రిజిగ్నేషన్ కాగితం తన చేతిలో పెట్టి, చిరునవ్వు నవ్వేసరికి, రామారావు తెల్లబోయాడు. మేనేజరుని తాను పొరబాటుగా అర్థంచేసుకున్నాడేమో. అతనింత విశాల హృదయుడా? రామారావు ద్రవించిపోయాడు. "థాంక్స్. నిన్న జరిగిన సంఘటనకి చాలా విచారిస్తున్నా. మీరు క్షమించాలి." కోరకుండా అపాలజీ వచ్చేసరికి సత్యనారాయణ చాలా ఆశ్చర్యపడ్డాడు. నాన్నగారన్న మాటలు నిజమా? ఇతని దగ్గరనుండి క్షమాపణ చెప్పించుకోడం కష్టమని తనకి తెలుసు. మరి యీ వైపరీత్యమేమిటి? ఇంతటి ఉత్తముడిని నిన్న అన్ని మాటలని చాలా అన్యాయం చేశాననుకున్నాడు.

"ఆఁ దానికేంలెండి. తప్పంతా మీ వొక్కరిదేకాదు. ఆఁ, అది సరే. ఒక్క మాట. ఈ విషయం ఎవరికీ తెలియనియ్యకండి." ముఖాముఖి అపాలజీ ఇవ్వకపోయినా నిన్న జరిగినదానికి బాధ్యత తన మీద కూడా వుంచుకున్నాడు. రామారావింకా ద్రవించిపోయాడు. మేనేజరుమాటలర్థం చేసుకున్నాడు. అలా తన నెందుకు కోరాడో వూహించుకో కలిగాడు.

సాయంత్రం తిరిగి మిత్రులతో కలిసినప్పుడు, "నేనే అపాలజీ ఇచ్చాను. దాంతో అన్నీ సద్దుకున్నాయ"ని చెప్పాడు. సుబ్బారావు, వెంకటేశ్వర్లూ కొంచెం తెల్లముఖం వేశారు. నవ్వుతో తిట్టుతిట్టినా ఎన్నయినా మానవుడు సహిస్తాడని వీళ్లకింకా తెలియదు.



# దయ్యాలు

అడవులలో తిరిగిన ఆదిమానవుని అజ్ఞానం నశించి మేధాశక్తి క్రమవికాసం పొంది అతడు మానవాతీతమగు శక్తులను అవగతం చేసుకోగా, తత్ఫలితంగా ఏనాడు అతనికి దైవచింత ప్రారంభమైందో, ఆనాటినుంచే అతనికి దయ్యాల జిజ్ఞాసకూడా మొదలైంది. సృష్టిరహస్య పరిశోధనలో మనస్సు లగ్నంచేసిన ఫలితంగా అతనికి ప్రప్రథమంలో ప్రత్యక్షమైనవే పంచభూతాలు. పృథివ్యాపస్తేజో వాయురాకాశములైన ఆ పంచభూతాలను ప్రసన్నం కావించుకోడానికి అతడు పాటుపడినాడు. తర్వాతనే అతనికి తక్కిన దేవతలు తారసిల్లినారు. ఆ దేవతలతో పాటు దయ్యాలుకూడా మానవుని మనస్సును ఆవహించినవి. ఆవిధంగా ఆదిమానవునిలో రేగిన దయ్యాలచింత అతని సంతతివారైన మనకున్నూ సంక్రమించింది.

అందుకు నిదర్శనంగా దయ్యాలను గురించిన ఊహాలు, ఉద్దేశాలు, నమ్మకాలు, అపనమ్మకాలు, కథలు, కబుర్లు, సిద్ధాంతాలు, రాద్ధాంతాలు మనలో వుండనే వున్నాయి. దయ్యాలు దేవతలకు జనించిన చిల్లర దేవతలు (Demi-Gods) అన్న సిద్ధాంతం అందులో ఒకటి. "విద్యాధరోప్సరో యక్షో రక్షో గంధర్వ కిన్నరాః । పిశాచో గుహ్యకస్సిద్ధో భూతోమీ దేవయోనయః" అనే అమరశ్లోకమే దీనికి తార్కాణం. "ఉత్తిష్ఠంతు భూత పిశాచాః" అనే భూతోచ్చాటన మంత్రం జపించి, తర్వాత సంధ్యావందనం ప్రారంభించడం కూడా దయ్యాల వునికికి దాఖలా చేసుకోదగిన సాక్ష్యం. "గదేఒశ నిస్పర్శన విస్ఫులింగే - నిష్పిణ్ఢి నిష్పిణ్ఢ్యజితప్రయాసి, కూశ్మాణ్డ వైనాయక యక్షరక్షో భూత గ్రహాం శ్చూర్ణయ చూర్ణయారీన్" అనే నారాయణకవచ శ్లోకం చూస్తే మనకు దయ్యాల భయం ఎంతవుందో బోధపడుతుంది. "దైవము" అనే పదమే "దయ్యము" గా మారిందని భాషాపరిణామ శాస్త్రం పారంగతులు భావిస్తారు. "పెనుసిగ దయ్యంబు" "గాలిదయ్య మపు డంతర్ధాన మైపోయె" అన్న కవిప్రయోగాలు కలవు. "బ్రహ్మరాక్షసకోట్ల పారద్రోలగవచ్చు" అనే నమ్మకంతో నరసింహ స్మరణచేస్తాము. "ఇది పిశాచములతో నిటలేక్షణుండు గజ్జెగదలించి యాడు రంగస్థలంబు" అని జాషువకవి అన్నాడు. ఆ కవే, మరొక సందర్భంలో "జపెలెదయ్యాల పగిది" అని వర్ణిస్తూ మరో క్రొత్తరకం దయ్యాన్ని చూపినాడు. "శాఖినీ ఢాకినీ గాలిదయ్యంబులన్ నీదు వాలంబునం జుట్టి, నేలం బడంగొట్టి" అనే ఆంజనేయ దండకంలోని భాగం దయ్యాలలోని మరికొన్ని తెగలను గూర్చి తెలుపుతుంది. సావధానంగా యోచిస్తే గాలికీ దయ్యానికీ ఏదో అవినా

'చదలవాడ'

భావ సంబంధం వుండేటట్లే తోస్తుంది. కాబట్టి దయ్యాల కబుర్లను "గాలి కబుర్ల" క్రింద జమకట్టడానికి వీలుకాదు. అసలు "గాలి" అంటేనే దయ్యానికి పర్యాయపదం. గాలి (air) లేకుంటే ప్రాణం పోతుంది సాధారణ పరిస్థితుల్లో. అసాధారణ పరిస్థితులలో "గాలి" సోకితే ప్రాణాపాయం కలిగేదీ తప్పదు. కాబట్టి మామూలు గాలికీ, మనం భయపడే "గాలి"కీ వ్యత్యాసాలు, సంబంధ బాంధవ్యాలు ఏమిటో పెద్దలనే అడగాలి. ఆ విషయాలు వారే గాలించాలి.

త్రిమూర్తులలో నొకడగు శివుడు "భూతేశుడు" (భూతేశః ఖండపరశు - ఇత్యమరః) అతని అనుచరులు భూతగణాలు. అతని కుమారుడైన విఘ్నేశ్వరుడు భూతగణాధిపతి. (గజాననం భూతగణాదిసేవితం)

మృత్యనంతరం జీవి యాతనాశరీరంతో తనుచేసిన పాప ఫలం అనుభవిస్తాడని మనమతం అంటుంది. *God the Father, God the Son* తో పాటు *Holy Ghost* కూడా క్రైస్తవ సిద్ధాంతరీత్యా పూజనీయమే. మరణించినవారి తాలూకు దయ్యాలు భగవత్సాన్నిధ్యంలో పుణ్యపాప విచారణ జరిగే రోజైన *Dooms Day* కు గాను వేచియుండుననేది వారి విశ్వాసం. షేక్స్పియరు కవి తననాటకాలలో దయ్యాలనుకూడా ప్రవేశపెట్టినాడు. ప్రతాపరుద్రీయంలో ఒక చిన్న అంతర్నాటకం వస్తుంది. అందులో యుగంధరుడు ఖుద్దా దయ్యాన్ని ప్రవేశపెట్టించి ఒక చిన్న నాటకం (నిజానికి బూటకం) ఆడించి సుల్తానుకు గిలి పుట్టిస్తాడు.

ఉర్దూలో "సైతాన్" అంటే దయ్యం అని అర్థం. వారు ఒకర్నొకరు "సైతాన్" అని తిట్టుకొంటారుకూడా. కేశసంస్కారం లేక చింపిరితలతో తిరిగేవారిని "చింపిరి దయ్యం" అంటాము. ఇదీ ఒక తెగ కావచ్చు. మాకొక డ్రాయింగు టీచరుండేవారు. "ఒకే కుంటిదయ్యం!" అని తిట్టడం ఆయనకి మామూలు. అందంగా బొమ్మలు గీయలేనివారు "దయ్యాలైపుట్టి మొర్రో వానదేవుడా" అని తిరుగుతారని ఆయన భయపెట్టేవారు. అప్పటికీ దయ్యాలవంటి బొమ్మలు గీచి ఆయన్ని భయపెట్టేవారు పిల్లలు. ఆ తరగతిలోనే ఒక వైష్ణవుల అబ్బాయి వుండేవాడు. వాడి పేరు వరదయ్యంగారు. వాడికి "కుంటిదయ్యం"తో పాటు "వరదయ్యం" గారు అని కూడా ఆ కొంటె మాస్టారు నామకరణం చేశారు. ఇంకో మిత్రవర్యుడు తన భార్యను గారాబంగా "దయ్యం!" అని పిలవడం అలవాటు.

ముస్లిముల "సైతాన్" లాగే మళయాళంలో "శాతాన్" వుంది. అదే అరవదేశంలో "కుట్టి శాతాన్" (పిల్లదయ్యం) అయింది. *Between the Devil and the Deep sea* అనే ఆంగ్ల ప్రయోగం కద్దు. సాహసవంతులను "*Dare-devil*" అంటారు. అహోరాత్రాలు కష్టపడి పట్టుదలతో పని చేసేవారికి "*He works Like a devil*" అని యోగ్యతాపత్రం యిస్తాము. *Idle-man's brain is a devil's work-shop*" అని సోమరిపోతులను హెచ్చరిస్తాము. "*Devil quotes the scriptures for its own Purpose*" అనే మరొక సామెత కూడా ఆంగ్లంలో వుంది. పెద్ద, ఆకార పుష్టిగల వస్తువులనుగురించి *Giant Size* అని వర్ణిస్తారు. అసాధారణ మేధాశాలిని *Intellectual Giant* అని పోలుస్తాము.

వివిధదేశాల ఆటవికనృత్యాలలో *Devil Dance* అనే పైశాచీనృత్యం ఉంది. బృహత్కథ పైశాచీభాషలో చెప్పబడింది. "చచ్చి దయ్యమై తగులుకుంటాను" అన్నమాట మనకు క్రొత్తగాదు. "డబ్బుకు దయ్యం

కూడా భయపడుతుంది" అని కొందరి నమ్మకం. అయితే వారెన్ని దయ్యాలను దెబ్బకొట్టినారో చెప్పలేము. "నిన్ను పట్టిన దయ్యం వదిలిస్తాను" అని కొందరు బెదిరిస్తారు. "అనుమానం పెనుభూతం" అని దయ్యాలనుగురించి కొందరినిర్వచనం. "నిత్య శంకితులు పరభాగ్యోపజీవివర్గరాలు దుఃఖ భాజనులు" అన్న చిన్నయసూరి వాక్యం. అందులో దయ్యాలను గురించి "అనుమానం" మాత్రం పనికిరాదు. "వాడు కాకుంటే, వాడిని పట్టిన దయ్యం" అని కొందరు వాదిస్తారు.

జ్యోతిషశాస్త్ర రీత్యా, జన్మనక్షత్రముల ననుసరించి మనలో దేవ, మనుష్య రాక్షసగణాలుగా విభజించేది కద్దు. అందులో కొందరికి దయ్యాలు కనబడును, మరికొందరికి కనబడవు అని కొందరి సిద్ధాంతం. ఈ సిద్ధాంతంమీద ఆధారపడే కొందరు దయ్యాలను ప్రత్యక్షంగా చూచినట్లు, మాట్లాడినట్లు, పనులు చేయించుకొన్నట్లు చెప్పడం మామూలు. వీరి మాటల్లో ఉత్ప్రేక్ష, అతిశయోక్తి - ఇత్యాద్యలంకారాలకు చేయవలసిన మినహాయింపులు చేసి విచారించి చూస్తే పీసమెత్తు నిజమైనా లేకపోదు. ఆంధ్రులకు చిరపరిచితమైన "పింగళివారి పేకి" కథ దీనికి చక్కని ఉదాహరణం. బాలనాగమ్మ కథలోని మాయల మరాఠీకి చాకల దయ్యాలు, మంగల దయ్యాలు చాకిరీ చేయడం చూస్తే దయ్యాలలో కూడా కులవ్యత్యాసాలు కలవని తేలుతుంది. ఇవిగాక అల్లావుద్దీన్ (*Alladin and the wonderful lamp*) కథలో, భట్టివిక్రమార్కుల కథలలో, జాతక కథలలో దయ్యాలనేకం వస్తాయి.

భూతవైద్యం అనే మంత్రశాస్త్ర సంబంధమైన చికిత్సా విధానం ఒకటుంది. ఆ విద్యలో ఆరితేరినవారు అసలే భయభ్రాంతులైన అమాయికుల కండ్లలో దుమ్ముకొట్టి (విభూతి మంత్రించి) డబ్బు గుంజుకోవడానికి ఎన్నో ఎత్తులు - అనగా తాఎత్తులు వేస్తారు. వీరు గిరిగీచి గిరిలోకి దయ్యాన్ని రప్పించి, దాని పుట్టుపూర్వోత్తరాలు విచారించి, వీడిపొమ్మని శాసించి, సత్యం చేయించుకొని, ఆవిధంగా పొయ్యేదానికి నిదర్శనాలు చూపి పొమ్మంటారు. ఆ దయ్యం ఫలానా దిక్కులో, కొండొక వృక్షం తాలూకు కొనకొమ్మను విరిచి పోతానని, ఫలానా పాడుబావిలో బండ వేసి పోతాననీ చెప్పి, చెప్పినంత పని చేసి పోతుంది. దీనిమూలంగా సత్యానికి కట్టుపడే విషయంలో మనకన్నా దయ్యాలే మేలని తోస్తుంది.

ఈ రాయివేసి పోవడాన్ని పురస్కరించుకొనే, "పోర పిశాశి కల్లు తూక్కి పోట్టు పోచ్చి" అనే అరవసామెత పుట్టింది. "పే యూనాలుం తాయ్" అన్న తమిళ సామెత కూడా వుంది. దయ్యమైనా కూడా, తల్లిమాత్రం తల్లే - అని మాతృహృదయాన్ని సూచిస్తుంది ఈ సామెత. "పెణ్ణై కండాల్ పేయుం ఇరంగుం" అనే సామెతకూడా కద్దు. కఠిన హృదయంకూడా స్త్రీని చూస్తే కరిగిపోతుంది అని దీని భావం.

ఒకానొక చోళరాజును బ్రహ్మహత్యా పిశాచం వెంటబడి వేధించుకు తినడం ప్రారంభించింది. ఆ బాధ భరించలేక శివభక్తుడైన ఆ భూపతి భూతపతిని ప్రార్థించినాడు. భూతగణాలలో నొకటి భక్తగణాలలోని ఒకరిని బాధపెట్టడం భావ్యం కాదని భవానీ భర్త రాజుకు స్వప్నంలో సాక్షాత్కరించి, తిరువడ మరుదూరులోని తన ఆలయంలోనికి వచ్చి పూజచేసి, వేరే ద్వారంగుండా తప్పించుకుపొమ్మని తరణోపాయం చెప్పినాడట. ఉమాపతి చెప్పిన ఉపాయం ప్రకారం రాజమార్గంలో ఆలయం ప్రవేశించిన రాజు సందుదారిలో పసందుగా తప్పించుకున్నాడు. ఆనాడు ఆలయం వాకిట్లో ఒక గూట్లో ప్రతిమారూపంతో రాజు రాకకు ఎదురుచూచిన ఆ బ్రహ్మహత్యా పిశాచం నేటికీ శిలారూపంతో, తిరువడ మరుదూరులోని శివాలయ ప్రాంగణంలో కనబడుతుంది. ఆలయంలోకి ఆ దారిని ప్రవేశించి అందరూ మరొక దారి గుండా ఇండ్లకుపోవడం ఇప్పటికీ అక్కడి ఆచారం. ఈవిధంగా ఆ గాథ శిలాశాశ్వతమైన ఫలితంగా తమిళ సోదరులు ఇతరులను పీడించేవారిని "చోళ బ్రహ్మత్య" అని దూషిస్తారు నేటికీ.

కొన్ని క్షేత్రాలలో దేవతా సాన్నిధ్యంలో సేవచేస్తే ఆవహించిన దయ్యాలు భూతాలూ అవే వదిలిపోవునే నమ్మకంతో ఆయా క్షేత్రాలకు పిశాచాది దుష్టగ్రహపీడితులు వెళ్లడం కద్దు. అట్టివి దక్షిణాదిని గుణశేఖరం, తెలుగునాడు చోళింగపురము ఆ నేవి.

వేదవేదాంగాలు, సమస్తశాస్త్రపురాణేతిహాసాలు చదివిన పండితుడు శాపవశాత్తు బ్రహ్మరాక్షసుడై, శాపవిమోచనానంతరం నిజరూపం పొందడం మొదలైన కథలు ఎన్నో వున్నవి. తులసీదాసుకు ఒక బ్రహ్మరాక్షసుడు ప్రత్యక్షమై, మాయా బ్రహ్మచారి రూపంలో, భక్తి పారవశ్యంతో, బాష్పపూరిత నేత్రాలతో రామాయణ కథా కాలక్షేపం వినే ఆంజనేయులవారి ఆచూకీ తెలిపినాడు. "యత్ర యత్ర రఘునాథ కీర్తనం - తత్ర తత్ర కృతమస్తకాంజలిం - బాష్పవారి పరిపూర్ణలోచనం - మారుతిం నమత రాక్షసాంతకం" అన్న శ్లోకం మననంచేసి అందులో నిజానిజాలు కనుగొన్న పండితుడేమో ఆ బ్రహ్మరాక్షసుడు! ఒకసారి కాళిదాసు "మత్సరపూర్ణమతులైన" పండితుల కుట్ర ఫలితంగా బ్రహ్మరాక్షస నివాసమైన ఒక భవనంలోకి పంపబడినాడు. వచ్చినవారిని చిక్కు ప్రశ్నలు వేసి సరైన సమాధానాలు రాకుంటే చంపేవాడట ఆ బ్రహ్మరాక్షసుడు. కాని కాళిదాస మహాకవి మేలైన సమాధానాలు చెప్పి మెప్పులుపొంది వచ్చాడు. భారతం చదివిన ప్రతివారికీ యక్షప్రశ్నలంటే తెలుస్తుంది. యక్షప్రశ్నలకు దక్షతతో సమాధానం చెప్పి నిక్షేపంవంటి తమ్ముళ్ల ప్రాణాలు నిలుపుకొన్నాడు ధర్మరాజు.

గారడి, వింతలు, వినోదాలు చేసిచూపి కుక్షి నింపుకునేవారికి "యక్షిణి" వశమైయుంటుంది. కర్ణపిశాచిని వశీకరణం చేసుకొన్నవారు కవరులో వచ్చిన ప్రశ్నలకు కవరు చింపకనే ప్రత్యుత్తరాలు పంపిస్తారు. కవరులోని ఏ ప్రశ్నకైనా *Cover* అయ్యేటట్లు సమాధానం ఆ కర్ణపిశాచి చెప్పడంవల్లనే కవరు చింపవలసిన ప్రమేయం వారికి కలుగదు. ఇవిగాక, మోహిని, కొరివిదయ్యం - ఇత్యాది నామాంతరాలతో ఎన్నో దయ్యాలు, భూతాలనుగూర్చి వింటూంటాము.

కొన్ని దేవతల పేర్లు, వాని రూపకల్పన, పూజావిధానాలు చూస్తే మన ఆధ్యాత్మికచింత ఒకరకమైన భూతోపాసనతోనే ప్రారంభమై తర్వాత వృద్ధిపొందిందనిపిస్తుంది. ఈనాటికి కూడా, మునీశ్వరుడు, చెంచువారు, కన్నెకలు మొదలైన దేవతలను కొలిచే ఆచారం మనలో నిలిచి వుండడమే దీనికి నిదర్శనం. వివాహాది శుభకార్యాలు తలపెట్టినపుడు పై దేవతల ఆరాధనలు మొదట జరగడం, పిల్లలకు ఈ కులదేవతల పేర్లే పెట్టడం నేటికీ మామూలే. మునిరత్నం, కన్నెమ్మ, చెంచురామయ్య, చెంచమ్మ, భేతాళరావు మొదలైన పేర్లు ఇందుకు నిదర్శనం. గతించిన ముత్తైదువలు, బ్రహ్మచారులు, కన్నెపడుచులు మన యిండ్లలో దేవతా సమానంగా పూజింపబడతారు. వారి పేర్లమీదుగా వస్త్రదానం చేయడం, వారి పేర్లు బిడ్డలకు పెట్టడం మనకు తెలిసిన విషయం.

భూతాలంటే మనం భయపడ నక్కరలేదు. "భూతము" అన్న మాటకు ప్రాణి లేక జీవము అనే అర్థం. కాబట్టి భూతాలంటే పిపీలికాది బ్రహ్మపర్యంతంగల

(55-వ పేజీ చూడండి)




## భూమిక

ఇరువదవ శతాబ్దపు ఉత్తరార్థంలో ఒక రోజు ఉదయం ఏడు గంటలవేళ భారతదేశంలోని ఒక పెంకుటింటి గుమ్మంలో మధ్యతరగతి మహారాజూ, యువరాజూ నిలబడి 'పెద్దమ్మా' అని ఏక గ్రీవంగా కేక వేశారు.

పెరట్లో చెంబులు తోముకుంటున్న పేదరాసి పెద్దమ్మ వచ్చి తలుపు బార్లా తీసింది. మహారాజూ యువరాజూ లోపలికి వెళ్ళారు. పెద్దమ్మకి చెరోపక్కా చేరి చెరో చెవిలో చెరో రహస్యం చెప్పారు. పెద్దమ్మ ఇద్దరికీ చెరో చిరునవ్వు ఇచ్చింది.

మహారాజు ఇచ్చిన ఇత్తడి చెంబులో యువరాజు ఇచ్చిన ఫౌంటెన్ పెన్ పడేసి, లోపలికి చక్కాపోయింది. మహారాజూ యువరాజూ ఎడమొహం పెడమొహం పెట్టి ఎదురెదురు గోడలు చూస్తూ నించున్నారు.

మహారాజు పేరు ఎన్. జి. ఓ. యువరాజు పేరు పి. హెచ్. డి. అంటే ప్లాట్ ఫారం హీరో డిసిగ్నేట్. ఈ సంక్షిప్త సంకేతాన్ని యువరాజు స్వయంగా తయారుచేసి తగిలించుకున్నాడు. దీనికి గర్వంగా వివరణ చెబుతాడు. అతని హితాభిలాషులూ, పరిచితులూ, మిత్రులూ, దూరపు చుట్టాలూ తరచుగా - వీలైనంత తరచుగా అతడి దరిద్రాన్ని జ్ఞాపకం చేస్తారు. అతను భోజనం చేసి ఎన్నాళ్లయిందో చెప్పేస్తారు. ఈ బాధ తప్పించుకోడానికీ, ఏడుపుని నవ్వుగా మార్చుకోడానికీ యువరాజు పి. హెచ్. డి. బిరుదు తగిలించాడు.

ఎన్. జి. ఓ. మహారాజు ధోరణి వేరు. గిట్టేనాటికి కావలసిన మూడడుగుల నేల కోసం ఈయాతనలు తప్పవు. చేతికి నూనె రాసుకోకుండా అప్పడాలపిండితో ఆటలాడబోతే సంసారం ఇలా అంటుకుంది. అంచేత ఆ పిండి వదలదు. కాబట్టి దానికోసం పబ్లికున దుఃఖపడినా రహస్యంగామాత్రం అసలుపిండే కాగుగదా, చేతులే లేవనుకొని సంతోషం తెచ్చుకోడానికి తిప్పలుపడతాడు. ఈ మహారాజు అనుగ్య యువరాజే. విధివశాత్తూ ఐదేళ్ళ క్రితం పట్టాభిషేకం జరుపబడింది...

ఎన్. జి. ఓ. ని చూసి పి. హెచ్. డి. నేరం చేసినట్టు బాధబడుతున్నాడు.

పేదరాసి పెద్దమ్మ నడ్డి తిప్పుకుంటూ నవ్వుకుంటూ వచ్చింది. ఇద్దరూ గుడ్లు

ముళ్ళపూడి
వెంకటరమణ

మిటకరించి చెరోపక్కా చేరారు. గుట్టుగా చెరో చేతిలో చెరో రూపాయీ ఉంచి గుప్పిళ్లు మూసింది పెద్దమ్మ.

కళ్లతో సాష్టాంగ నమస్కారం చేసిన ఎన్. జి. ఓ. ని చూసి తనమీద తనే జాలిపడ్డాడు పి. హెచ్. డి.

ఎన్. జి. ఓ. మహారాజూ, పి. హెచ్. డి. యువరాజూ నిశ్శబ్దంగా నడచి బజారు రోడ్డుకి వచ్చారు. ఆగారు. యువరాజే ముందు పలకరించాడు. "అయ్యా మీరు ఎటువెళతారో చెప్పండి, నేను రెండో వేపు వెళ్తాను."

మహారాజు అర్థం చేసుకున్నాడు. కృతజ్ఞత పారబోశాడు. "అబ్బే, మీ ఇష్టం. మీరే నిర్ణయించుకోండి. నేనే రెండో వేపు పోతా."

"అబ్బెబ్బే తమరు పెద్దలు."

"అయితే సరే. నేను అటు పెద్దబజారుకి వెళ్తా" అన్నాడు మహారాజు సిగ్గుపడుతూ.

"చిత్తం నేను ఇటు చిన్నచెరువు వేపు వెళ్తా."

"సెలవండి."

"సెలవు"

పరస్పరం మెచ్చుకుంటూ ఇద్దరూ చెరో వేపూ నడిచారు.

బజారు రోడ్డు గంటస్తంభం దగ్గర వీడ్కోలు చెప్పుకున్నారు. మహారాజు కుడివైపూ యువరాజు ఎడమవైపూ బయలుదేరారు—

యువరాజు ఏకాయెకిని కాఫీ హోటలుకి వెళ్ళాడు. దర్జాగా ఇడ్లీ కాఫీ పుచ్చుకున్నాడు. ప్రొప్రయిటరు ముందు బిల్లు పడేసి అరువు చెప్పాడు ధీమాగా. కథ చెడిస్తే జేబులో రూపాయి ఉందిగా...

"అసలు జేబులో రూపాయి ఉంది కాబట్టే, కథ అక్కడా ఇక్కడా కూడా అడ్డం తిరగలేదు" అనుకున్నాడు యువరాజు.—హోటలు దాటివచ్చి, 'ఇచ్చట అరిచి చచ్చినా అరువు ఇవ్వబడని' రావ్స్ స్పెషల్ హైక్లాసు కిళ్ళీ కొట్టులోంచి ఒకటేసి పుచ్చుకున్న అరువు కిళ్ళీ నములుతూ, అరువు సిగరెట్టు పీలుస్తూ...

యువరాజుకి తట్టుకోలేనంత హుషారుగా ఉంది. 'ప్రపంచంలో మనుషులు మంచివాళ్లే పాపం' అనుకున్నాడు. ఝాంమని రామమోహన గ్రంథాలయానికి వెళ్ళి ఓ మూల కుర్చీ దగ్గరకు చేరి 'పంచవర్ష ప్రణాళిక' మీద పడి నిద్రపోయాడు.

## మహారాజు కథ

ఇక కుడివేపు బయల్దేరిన మహారాజు ఇలాటి పనులేవీ చెయ్యలేదు. చెయ్యడు కూడా.

"అతనికేం; ఒంటరిపక్షి. విచ్చలవిడిగా



"బస్సేం కర్మం? విమానం ఎక్కించేస్తా" అంది పెద్దకాకి.

తిరుగుతాడు. ఉంటే తింటాడు లేకపోతే మానేస్తాడు హాయిగా. నాకు బోలెడుకుంది మార్బలం ఉందాయె. అతనిలా నాకెలా చెల్లుతుంది?" అనుకున్నాడు మహారాజు, పెద్ద పెద్ద అంగలు వేసి నడుస్తూ, ఈలపాటకి అడుగులు లయ కలుపుతూ.

ఎన్. జి. ఓ మహారాజు ఎప్పుడు పడితే అప్పుడు ఈలవెయ్యడు-వేసినారాడు. నెలకో సారి ఈలపాట పాడతాడు తన్మయుడై. ఇది జరిగేది ఒకటో తారీఖు సాయంకాలం ఇంటికి వెళ్ళేవరకే. ఆ తరువాత నెల మధ్యలో ఒకటీ రెండూ అప్పుచేస్తే ఈల వేస్తాడు. పుట్టి మునిగే అప్పులున్నాయి. కొత్తవి పుట్టడంలేదు. అందువల్ల పావలా అప్పు దొరికినాకూడా ఎదో మాటవరసకి, సాంప్రదాయంకోసం అన్నట్లు ఈల వేస్తాడు.

మహారాజు ఈలవేస్తూనే ఆలోచిస్తున్నాడు. ముందర ఈపూటకి బియ్యం చూడాలి. చూడ్డానికేముంది. డబ్బుందిగా. పనిలోపని ఓ పదలం బంగాళదుంపలు పట్టుకుపోతే మంచిది. పిల్లలు మొహం వాచిఉన్నారు. పాపం ఓ ముద్దూ ముచ్చటా ఎరగరు వెత్తిసంకలు.

బియ్యం కొట్లోకి ప్రవేశించాడు మహారాజు.

"అక్కుళ్ళెలా యిస్తున్నారండి?"

"శేరు రూపాయిన్నర యిచ్చాముండి"

"శేరు సరేలెండి. బస్తా ఎలాగంట?" షావుకారు చెప్పాడు.

"అబ్బే! మీరు బొత్తిగా తెలీనివాళ్ళకి చెప్పినట్టు చెప్తున్నారు."

"సరిలెండి. తమరి కెంతకావాలి చెప్పండి. ప్రత్యేకం తగ్గిస్తాం."

"ప్రత్యేకంకోసం ఎందుకండి తగ్గింపు. ముక్కు మొహం ఎరగరుకదా."

"తమరు పరాచికాలాడితే ఏం చెప్పమండీ! ఎదో బేరం సారం అన్నారు. ఓబస్తా ఏయించమంటారా?"

"ధర చెప్పారు కాదు."

షావుకారు ప్రత్యేకమైనధర చెప్పాడు - మొత్తంమీద పావలా తగ్గించి.

"సరే కృష్ణకాటుక లెలా చెప్పండి."

"మీ కెంతకావాలి చెప్పండి బాబూ."

మహారాజు కొంచెంతటపటాయించాడు.

"ప్రస్తుతాని కర్ధశేరు ఇవ్వండి. శాంపిల్ చూసి బావుంటే ఓబస్తా పుచ్చుకుంటా తాపీమీద"

"ఒరేయ్! ఈనబేరం మాడరా. నాకు పనుంది" అన్నాడు షావుకారు గుమాస్తాని పిలుస్తూ.

"ఏమిటయ్యా అంత చిరాకు. మహాపుట్లూ పందుములూ అమ్మేవాళ్లా చెప్తున్నావు కబుర్లు"

"చాల్లేవయ్యా! నువ్వు బత్తాలూ అర బత్తాలూ కొనేవాళ్ళానే చేశావు బేరం."

"ఏం! కొనేతాహతు లేదనుకొన్నావా? అంతరం తెలిసి మాటాడు." మహారాజు చరచర బయటకొచ్చాడు. లేనిపోని గొడవ పెట్టుకున్నాడు తను. ఎన్నిసార్లొద్దనుకొన్నా తనకి అలవాటు పోలేదు. చిరాకేసింది - బజారుచెయ్యడం చేతకానందుకు.

ఇంకోకొట్లో కెళ్ళాడు.

"ఏవండీ అక్కుళ్ళు శేరెలాగండీ?"

"రూపాయిన్నర"

"ఓహో! కృష్ణకాటుకలు?"

షావుకారు చెప్పాడు. షావుకారు పది నిముషాలవరకూ వినకుండా చెప్పాడు. వీడెలాగయినా మర్యాదస్తుడే - అనుకున్నాడు మహారాజు. కనీసం ఓ శేరు బియ్యం కొనేద్దామనుకున్నాడు. కానీ రూపాయే ఉందికదా! ఇంత మర్యాదస్తుడి దగ్గర అర్ధశేరుకొంటే బావుండదు; చిన్నబుచ్చుకుంటాడు.

"మళ్ళీవస్తానండి - ఆపైన కనుక్కొని"

"మహారాజులారండి."

# ★ మహారాజూ యువరాజూ ★

మహారాజు నవ్వుకున్నాడు.

"సరేలే. ఈరూపాయిలో బియ్యంకొనే దేమిటి! సిగ్గుచేటు. ఎవరేనా చూసినా బావుండదు. ఈ పూటకి ఆవిడే అప్పో సొప్పో చేస్తుంది."

సంతలోకెళ్ళాడు.

"ఏం చామాలూ కులాసా? బంగాళ దుంప లెలా?"

"రండి బాబు రండి. ఇయి ముప్పావలా ఇయి రూపాయనా. వంకాయలు ముప్పా లాండి. ఎన్న ముద్దలు."

"సరేలే. దుంపలిచ్చే ధర చెప్పు."

"రూపాయి చేసేక్కోండి బాబూ."



"ఆపైన వాకబు చేసుకొస్తానుండు."

"పల్లె బావయ్యా! నువ్వోనాడు కొన్నావేటి. బేరమాడ్డవే కాని."

"అందరూ కొనేవాళ్ళయితే నీవంటివాళ్ళెందుకే అమ్మడానికి. నీ మనవడు చాలు"

వెకిలిగా నవ్వుతూ బయల్దేరాడు.

మళ్ళా బజారురోడ్డున పడ్డాడు మహారాజు. కొత్త కాఫీ తాగితే!...ఛీ! ఇంటి కోసం అని చెంబు తాకట్టెట్టి రూపాయి తెచ్చి అది కొస్తా హోటలువాళ్ళ ఎదాన పొయ్యడమా?

మూడు కిరాణాకొట్లలో 30 నిమిషాల సేపు బేరం ఆడి బయటపడ్డాడు. ధరలు మండిపోతున్నాయి...ఏవిటో...తనొక్కడుకూడా బేరమాడినంత జోరుగా సరుకు కొనలేకపోయాడు. ధరలు మండితేనేం మండకపోతేనేం - విబులం ఉన్నా, సవాలేరు చింతపండూ కొనడానికి.

అభిమానం ముంచుకొచ్చింది. ఛీ! మరీ దవటాలోచన లొస్తున్నాయి. వెధవది - కోఆపరేటివ్ బ్యాంకువాళ్ళు అప్పేదో తొరగా తగలేస్తే ఈ ఉన్న అప్పులన్నీ ఒక్కసారి తీర్చిపారేసి రెణ్ణెల్ల గ్రాసం కొనిపడేసుకోవచ్చు. నాలుగు రాళ్ళు కంటి కొస్తాయి. కుర్రవెధవ మూడు చక్రాల సైకిలో అని గోల పెడుతున్నాడు. ఒకటి కొనాలి.

జేబులో రూపాయుంది కదా అన్న ధీమాతో బుచ్చిరాజుగారి ధనరాజు ఇనప కొట్లో కెళ్ళాడు.

"ఏవండీ, మూడు చక్రాల సైకిళ్ళు చూపించండి."

"అదుగో చూడండి."

"కొత్త దిట్టంగాఉండేది ఒందేదో మీరే చెప్పండి బాబూ. మా రెండోవాడు రాతుసివెధవ లెండి. చేతికిచ్చిందల్లా విరిచి అక్కడ పెడతాడు."

బుచ్చిరాజుగారి ధనరాజు ఫెళ ఫెళ నవ్వాడు—పెద్దవాళ్ళూ పెద్దవాళ్ళూ నవ్వుకునే నవ్వది; మేనేజర్లూ మేనేజర్లూ నవ్వే నవ్వది.

"అంతే లెండి. అలాటి కొడుకే ఉండాలి. అయినా సైకిళ్లు పిల్లలు విరవకపోతే డబ్బిచ్చికొన్న మీరు విరుస్తారటండీ."

మహారాజుకి వళ్లు పులకరించింది. "మీ కేవిటండీ కబుర్లు చెప్తారు. చెన్నపట్నం నించీ ఆమధ్య రెండు సైకిళ్లు తెప్పించా. రెండూ విరిచి పెరట్లో పారేశాడు."

"వయసేం కదండీ - ప్రయోజకుడే. నా వాడు విరవకుండానే వీథులో పారేస్తాడండీ. పైగా మా బాబు కొట్లో వున్నాయిగా అంటాడు. అది మాకాలో లేదో."

ఇద్దరూ ఫెళ్ళున నవ్వారు మళ్లా. పక్కన నుంచున్న కొట్టు గుమాస్తా జంకుతూ సన్నంగా నవ్వాడు.

అది మేనేజర్లూ మేనేజర్లూ నవ్వుకునేటప్పుడు అచ్చంగా తను నవ్వే నవ్వులాటిది. ఇపుడు తనూ షావుకారు సమాన స్థాయిలో నవ్వుతున్నారు గట్టిగా.

నవ్వు పూర్తయేసరికి మహారాజుకి కళ్ళు చెమ్మగిలాయి. నిజంగానే సైకిలు కొనేయ బుద్ధేసింది. జేబులో చూస్తే ఓ రూపాయే ఉంది. కోఆపరేటివ్ అప్పు పదిరోజుల్దాకా రాదు. సరదా చల్లారిపోయింది.

"సరేలెండి. సాయంత్రం వాడినే తీసుకొస్తా. వాడికి నచ్చింది వాడే ఏరుకుంటాడు."

తక్షణం పదిరూపాయిలేనా సంపాదించి జేబులో వేసుకు తిరగాలని మహారాజు మనసు ఉవ్విళ్ళూరింది. ఒకటో తారీఖు ఇరవైరోజు లుండనగా ఎవడిస్తాడు అప్పు!..

ఘోరాతి ఘోరంగా చితక్కొట్టిన ధరలకి గుడ్డలు అమ్మేస్తున్న సిల్కు ప్యాలెసులో కోరామక్సు దగ్గర నుంచి గాబర్డీన్ వరకూ బేరమాడి బయటకు తేలేసరికి పదిగంటలయింది. మహారాజుకి విపరీతంగా ఆకలివేస్తోంది. తర్జన భర్జన లేకుండా తెగించి హోటల్లోకి ఎళ్లిపోయాడు.

పదిగంటలయినా ఇడ్లీ సాంబారు ఇంకా ఉండడం చూసి బోలెడు ఆశ్చర్యపడి, ఇడ్లీ తెమ్మన్నాడు - ఆ తర్వాత కాఫీ తాగుదామనుకున్నాడల్లా.

తీరా ఇడ్లీ తినడం మొదలుపెట్టేసరికి పక్కాయన ప్లేటులో పెరుగువడలు మహా అందంగా కనపడ్డాయి.

సరే పెరుగువడలు ఆర్డరు చేసేసరికి, సెర్వరుకి మహారాజు మీద గౌరవం హెచ్చింది. 'అనియన్ పెసరట్ రోస్టు స్పెషల్ వేస్తానండి' అంటూ సరదా పడ్డాడు.

సెర్వరు సరదా చూస్తే మహారాజుకి ముచ్చటవేసింది. వాడి ముద్దు చెల్లించకపోతే చిన్నబుచ్చుకుంటాడు.

"సరే పట్రా." అన్నాడు కొత్త ఉత్సాహంగా. ఈ ఉపారు చూసి పెసరట్టులో ఉప్మా వేసి తెచ్చాడు వాడు. ఈ రెండూ జాయింటులు.

పదకొండణాల బిల్లు చెల్లించి చల్లగా ఇవతలకొచ్చాక ఇల్లు జ్ఞాపకం వచ్చింది. హోటలువాడు కొల్లగొట్టాడు. ఇంట్లో



## వ్యాసకాశి

(గంగానదికి ఆవలివైపున రామనగర్ కోట. ఈ కోటలోనే వ్యాసలింగం ఉన్నది.)

ఫోటో: వి. సీతారాం. (మద్రాసు)

ఛీ హ్యాపుగింజా బొగ్గుముక్కా లేవన్న విషయం మరిపించి తనని మేపారు వెధవలు.

"ఛీ" అనుకున్నాడు మహారాజు. ఇంక పిసణాలు మిగిలింది. అయిన దిలాగా అయింది; వచ్చిన కష్టం రానే వచ్చింది; అందుకని ఓ అణా పెట్టి స్పెషల్ మీఠా కిళ్ళీ, అణాన్నర పెట్టి హైక్లాసు సిగరెట్టు ఒకటి కొన్నాడు.

పక్కకొట్లోకి వెళ్లి అణాన్నరకి దక్కను పెట్టె, అర్ధణా అగ్గిపెట్టె కొనేశాడు. మిగతా అర్ధణా ముష్టి వేశాడు.

సిగరెట్ తాగుతూంటే అతనికి ఇల్లు జ్ఞాపకం వచ్చింది. ఇంటిదగ్గర ఏమైపోతోందో. బహుశా తనకోసం చూసి చూసి అలిసి అప్పు తెచ్చి ఉంటుంది. దొరికిందో లేదో! చెంబు తాకట్టు పెడితేగాని తనకే దొరకలేదు అప్పు.

మహారాజుకి రోత పుట్టింది - సంసారం మీదా, తనమీదా కూడా. ఉత్తరక్షణాన పౌరుషం వేసింది. పట్టుదల హెచ్చింది. పది రూపాయిలు కళ్లచూసిందే కొంప మెట్టకూడదనుకున్నాడు. పొరుగు ఊళ్లో మిత్రులున్నారు. కాళ్ళా వేళ్ళా పడి అయినా అప్పు సంపాయించాలనే పట్టుదలతో ట్రంకురోడ్డు ఎక్కాడు మహారాజు.

పదకొండు గంటలు కొట్టింది...

* * *

## యువరాజు కథ

...పదకొండు గంటలు కొట్టింది గడియారం.

గ్రంథాలయం గుమాస్తా తలుపులు మూస్తున్నాడు. నిద్రపోతున్న యువరాజును లేపి ఇంటికెళ్లమన్నాడు.

'ఎవరింటికి?' అన్నాడు యువరాజు ఆవలిస్తూ, బయటకొస్తూ, కళ్లు తెరుస్తూ. జేబులోని రూపాయిబిళ్ల గరుకులని ఆప్యాయంగా ప్రగాఢంగా అదిమాడు.

'నీ జుట్టు చిందరవందరగా ఉన్నా, నీ కళ్ళు లోతుకుపోయినా, నీ బుగ్గలు సొట్టలుపడినా నువ్వు బాగున్నావోయ్' అంది కిళ్లీకొట్టు అద్దం. ఘాటైన చార్మినార్ దమ్ము లాగాడు యువరాజు. బాగా మెలకువ వచ్చింది. మనస్సు తేలికగా ఉంది. ధీమాగా అడుగు సాగించాడు బజారువైపు.

ఈ రూపాయి ఖర్చుఅయిపోయేలోగా ఏదేనా పెద్దపని చేసెయ్యాలని మనసు ఉబలాట పడుతోంది. పదిరూపాయిలు కళ్ళచూడాలి అనుకున్నాడు పెదిమలు బిగించి పళ్లు కొరుక్కుంటూ.

మనసు కులాసాగా, జేబు ఢిలాసాగా

# ★ మహారాజూ యువరాజూ ★

ఇలా ఉన్నప్పుడే నలుగురినీ చూచి ఉద్యోగాలు అడిగెయ్యాలి. ఇప్పుడు ధీమాగా అడగొచ్చు. వాళ్లు ఉద్యోగం ఇవ్వకపోయినా దర్జాగా హోటలుకిపోయి ఒకటికి రెండు కప్పులు కాఫీతాగేసి నాలుగు సిగరెట్లు కాల్చెయ్యొచ్చు.

రూపాయిబిళ్ళ అంచుని మూపు దుస్ వేలితో తడిమాడు.

శక్తి విజృంభించింది.

ఆలోచనలు ఇనుమడించాయి.

గుమాస్తా ఉద్యోగాలకి ప్రయత్నాలు మానుకు వేశాడు.

ఒక కంపెనీ ఉంది. దాని మేనేజరు సారస్వత ప్రియుడట. కొత్త కథలు రాసే వాళ్ళంటే సరదాట. తనకి కథ రాయటం రాదు. రాదని కాదుగాని ఇంతవరకు రాయలేదు. ఇప్పుడు రాసి...ఎందుకూ—ఎవడి చేతనైనా రాయించి...ఛీఛీ...మంచి ఇంగ్లీషుది కాపీకొట్టి...అంతకన్న అనువదిస్తే మేలు - వాడి పేరు గిరాకీతో తన కథ పడుతుంది. అది చూపిస్తే కథలు రాసే మేనేజరుకి అభిమానం పుట్టుకొస్తుంది. తోటి సోదరుడని ఉద్యోగం పారెయ్యొచ్చు సానుభూతితో.

చూసుకుపోయిన కారు వెంటబడ్డ తన కళ్లు, కారులో అమెరికన్ ఇంజనీరునీ, అతని తెల్లాటి కూతుర్నీ చూశాయి.

చేతిలో ఉన్న చార్మినారు పీకవంక దీక్షగా చూశాడు...

అప్రయత్నంగానే ఇంజనీరు కూతురితో ఇంటర్వ్యూ ఊహించాడు.

రంగురంగుల దృశ్యం కనబడుతోంది.

తను హై హై అని యాంకీయాసతో మాట్లాడేస్తున్నాడు.

ఇంజనీరు కూతురూ, అప్పిల్లనాన్న ముందర ముచ్చటపడి ఆపైన విస్తుపోయారు.



'మీ కీదంతా ఎలా పట్టుబడిందండీ!'

'నాకు అమెరికా అంటే చాలా అభిమానం. నేను మీ సినీమాలు తెగచూస్తా. నేను కథ రాశా, అమెరికాకి పంపుదామని.'

'మాకివ్వండి - మేం దాని సంగతి చూస్తాం'

ఇంజనీరు కూతురికి తనురాసిన కథ అందిస్తూండగా చేతులు తగిలినందుకు ఒళ్ళు జలదరించింది యువరాజుకి. ఆ పులకుతో—

రోడ్డుమీద మామిడి టెంకని విలాసంగా తన్నబోయి కంకర్రాయిని తన్నేశాడు.

ఇంజనీరు కూతురితో ఇంటర్వ్యూనించి హఠాత్తుగా మేలుకొన్నాడు, భూపాల రాగంతో - అబ్బా! అని బొటనవేలు రక్తం చూసుకుంటూ.

దెబ్బకి తలలో నరాలు కంపించాయి. ప్రాణం జిలార్చుకపోయింది.

నడక ఆపి ఓ చెట్టుకి చేరగిలినిలబడ్డాడు.

మండే మధ్యాహ్నం మధ్య నించున్న ఎండినమోడుమీదనించున్న రెండు కాకులు కావుకావు మన్నాయి - అవి అక్కచెల్లెళ్ళు.

'అక్కా అక్కా చూశావే?'

'చూశా చెల్లీ'

'అక్కా ఎవడే ఈ చిన్నవాడు?' అంది కాకి చిన్నది.

'వీడు తెలీదు? ఈ జాతివాళ్లని మనం బోల్డుమందిని చూశాం. మొండికెత్తిన నిరుద్యోగికి గెలుపు గ్యారంటీ అనే రకం.'

'మొహం చూస్తే అలా వుందేం.'

'భుక్తాయాసం, దండయాత్రకి ఉపక్రమణ. బాదం హల్వా తింటూంటే ఇంగువ ముక్క పంటికింద కొచ్చింది.—చూడలే- ఇప్పుడే ఓ ఇంజనీరు కూతురితో ఇంటర్వ్యూ భోంచేశాడు. కడుపు నిండేలా భోంచేసిన మత్తులో కంకర్రాయిని తన్నాడు. వేలు బద్దలై మేలుకొన్నాడు మళ్ళా—బద్దలైంది వేలు కాదూ, వేలు బద్దలు కాలేదూ అని నచ్చచెప్పుకుని మొండికెత్తుతాడు. ఇలా ఇంటర్వ్యూలు, ఆకలూ భోంచేస్తూ ఉంటాడులే.'

చిన్న కాకికి సరదా పుట్టింది - 'రెట్ట వేస్తే?' అంది ఉత్సాహంతో.

'వేసిచూడు' అంది అక్క అనుభవశాలిలా. చిన్న కాకి రెట్టవేసింది.

యువరాజుకి నెత్తి తడుముకోవాలో, రక్తం కారుతూన్న వేలుని ఓదార్చాలో తెలీలేదు.

ఒక్క క్షణం ఆలోచించి రెండూ మానేశాడు. తిన్నగా పదిగజాల దూరంలో ఉన్న పంపుదగ్గర కెళ్ళాడు.

వేలు కడిగేశాడు.

ఆపైన మెల్లిగా రెట్ట తుడిచేశాడు. మొహం తోమేసుకున్నాడు. ఎండిన ఎర్రటి జుట్టుకి నీళ్లు పట్టించాడు. జేబులోని చిన్న దువ్వెన తీసి అక్కడే తల నున్నగా దువ్వేసుకున్నాడు.

దువ్వుతూండగానే ఈలపాట కూడ పెట్టాడు—బాధ మరిచిపోడానికి.

కాఫీ తాగాలనుకున్నాడు కూడా. తిన్నగా ఇంగ్లీషు హోటలు కెళ్లాడు—బాధ అణచుకొని, హొయలు ఒలకబోస్తూ.

'వీడి దుంపతెగా - పైకేనా చూడలేదే' అంది చిన్న కాకి.

'నే చెప్పలే' అంది అక్క చిరునవ్వుతో.

కాఫీ ఆర్డరు చేసి, 'హాయిగా దేశవాళీ హోటలు కెళ్ళి మసాలా దోశ తినవలసింది' అనుకున్నాడు యువరాజు. నోటిలో తల పెట్టి రొకటి...చల్లని మంచినీళ్లు తాగి, కాఫీ కలుపుకుంటూ—'సిగరెట్టు తే' అన్నాడు.

బెయిటరు అణారకం సిగరెట్లు నాలుగూ అణా అగ్గిపెట్టె ఒకటీ పళ్లెంలో తెచ్చి మహా వినయంగా పెట్టాడు బల్లమీద.

కాఫీ మూడణాలు - ఇవి అయిదణాలు మొత్తం అర్ధరూపాయి!!—

బిల్లు ప్లేటులో పెట్టి, ప్లేటు ట్రేలో పెట్టి, తల బిల్లుకి తగిలేటంతగా ఒంచి, బిల్లు బల్లమీద ఉంచాడు - బెయిటరు. నిర్లక్ష్యంగా పొగ వదుల్తూ, రూపాయి ప్లేటులో ఉంచాడు యువరాజు. బెయిటరు - రెండు పావలా కాసులు తెచ్చాడు చిల్లర.

యువరాజు గొంతులో వెలక్కాయ పడింది. వీడికి 'టిప్' ఇవ్వకపోతే పరువు తక్కువ బేవార్సుగాడనుకొంటాడు. పోనీ అణా బేడా ఇద్దామనుకుంటే, దొంగపీనుగ రెండూ పావలా కాసులు తెచ్చాడు. అసలు హోటలువాళ్ళు పీక్కా ప్రట పన్నారు.

గోవిందా అనుకుంటూ ఓ పావలా కాసు అతి నిర్లక్ష్యంగా తీసి జేబులో వేసుకున్నాడు. 'స్ స్' (థ్యాంక్సుకు సంక్షిప్తం) అంటూ అంతకన్నా నిర్లక్ష్యంగా ఆ పావలా తీసుకున్నాడు. బెయిటరు.

మండే మధ్యాహ్నం మీదకి మళ్లీ ఒచ్చేశాడు యువరాజు. ఎండ మండుతోంది. కాళ్ళు కాల్తున్నాయి. నెత్తి మాడుతోంది. ఆకలి వేస్తోంది. బస్సెక్కితే?...అమ్మో. ఉన్నది పావలా ఇందులో బస్సా...చెట్టుమీది చెల్లి కాకికి జాలివేసింది. "పాపం

ఎలాగ" అంది. అనుభవశాలిని ఆ యువ అక్కౌకి మందహాసం చేసింది.

"దిక్కు లేనివారికి దేముడే దిక్కు. పిడికి నేనే దిక్కు. బస్సు కాదు; విమానం ఎక్కిం చేస్తా చూడు." అంది గంభీరంగా.

యువరాజు నడుస్తున్నాడు - భోం చేసి ఎన్నాళ్ళయిందో లెక్క పెట్టుకుంటూ.

ఎదురుగుండా వయ్యారిభామ ఒక తె వస్తూంది. వెడల్పాటి నల్లఅంచు గల పసుపు పచ్చని చీర కట్టింది. నల్లటి పొట్టి రవిక తొడిగింది. ఎఱ్ఱని ముఖముల్ చెప్పులు వేసింది. ఆఎండలో నే యథాశక్తి విలాసం ఒలికిస్తూ నడుస్తూంది.

ఇంగ్లీషు హోటలుకి వెళ్తూంది కాబోలు అనుకున్నాడు యువరాజు.

ఇరవైక్షణాలపాటు ఆమెని కాయలిక్కులా చూశాడు. యువరాజు. ఇరవయ్యొకటో క్షణానికి కొత్త అనుభూతి - అమెడదూరాన ఉన్నది, వచ్చి అతనిమీద వాలింది; లోపల వ్యాపించింది; తనలో ఇముడ్చుకుని పొదువు కుంది...

ఇటువంటిపిల్లతో ఒంటి స్తంభపు మేడలో ఒంటరిగా ఉంటే...

ఇటువంటిపిల్ల అనుకున్నాడే కాని, నిజానికి ఎటువంటిదో అతనికి నిర్ధారణగా తెలియదు. ఎందుకంటే ఆ అమ్మాయి ప్రత్యంగ సౌందర్యమూ అతడిని ఉక్కిరి బిక్కిరి చేసింది. ఆమె ముఖంకూడా సరిగ్గా చూడలేదు. బహుశా పచ్చచీర నల్లఅంచు చూసి ఉండచ్చు. నల్లరవిక మాత్రం ఖచ్చితంగా చూశాడు.

ఆ ఒప్పులకుప్ప, వయారిభామ ఐదు గజాల దూరానికి వచ్చేసింది. ఏదో మహా త్కార్యం చేసెయ్యాలనే ఉద్వేగం ప్రకో పించింది.

యువరాజుని విమానం ఎక్కిస్తానని శపథం పట్టిన వాయసరాజము ఈ క్షణాన రంగభూమికి ఉరికింది. ఎడారిలాగే పరుచు కున్న ఆ మధ్యాహ్నపు వేళ, ఎండిన మోడులు మినహా సాక్షులు లేని ఆ రోడ్డుమీద, నడుస్తున్న వయారిభామ మీదికి వాయసాంగన చెంగున ఎగిరింది. కావుమంది. ఇంచుమించు ఆ పడుచు నెత్తిన నిలచి రెక్కలు టపటప లాడించింది. మళ్లీ కావు కావు అంది.

కెవ్వుమంది వయారిభామ. వెంటనే యువరాజు దుష్యంతుడి పద్ధతిలో ముందు కురికాడు. హాహూం అంటూ కాకిని బెద రించి తరిమేశాడు.

పమిట సర్దుకుంటున్న వయారి భామ వంపుల సొంపులు క్షణంలో సగం చేపుమాచిన యువరాజులో కొన్ని సున్నితమైన నరాలు - ఫ్యూజు వైరులా భగ్గునమండి భస్మం అయిపోయాయి.

వయారిభామ వయారన్నరగా థ్యాంక్స్ అంది. వయ్యారం ముప్పావుగా రోడ్డుమీద పడిఉన్న చేతిసంచీ తీసుకుంది. జనం ఎవ్వరూ లేరన్న సంతోషంలో రెట్టింపు వయారం ఒలకబోస్తూ వెళ్లిపోయింది. వెడలు చున్న భామ పోయగాన్ని వెనకనుంచి అర నిముషంసేపు శ్రద్ధగా చూసిన యువరాజు, పది అడుగులు నడిచేలోగా విమానం ఎక్కి విహారానికి బయలుదేరాడు...

......ఒంటి గంటంపావుకి, ఒక పెద్ద భోజన కాఫీహోటలు పెరటిగుమ్మం వున్న వీధిలోని చిన్న కిళ్లీకొట్టుదగ్గిర విమానం దిగిపోయాడు యువరాజు......ఆకలి విప రీతంగా వేస్తోంది. నీరసంగా ఉంది. కిళ్ళీ కొట్టులో వేరుశెనగ ఉండలు ఉన్నాయి. రెండు కొనుక్కు తిని, కొసిని మంచినీళ్లు తాగితే కడుపు చల్లబడుతుంది... కాని ఎవ రేనా చూస్తే?...

తెగించి కొనేశాడు రెండు ఉండలు. స్టయిలిష్ గా, వేరుశెనగఉండల పరిశ్రమను ఉద్ధరించేవాడి పోజులో తినడం మొద లెట్టాడు కొట్టుదగ్గరే నిల్చుని.

గజందూరంలో ఒక హైక్లాసు ముష్టి వాడూ, పెద్ద హోటల్లో క్లీనరూ బేరా లాడి ఒప్పందం కుదుర్చుకుంటున్నారు.

'వారానికి అర్ధరూపాయి ఇస్తే భోజ నపు హోటలు ఎంగిలాకులన్నీ నువ్వొచ్చే వరకూ ఉంచి నువు రాగానే నీకు పడేస్తా' అంటున్నాడు క్లీనరు.

'అరణాలు చేసుకో' అన్నాడు ముష్టి వాడు.

'ఇది 'ఏ' క్లాసు హోటలు తెలుసా! అర్ధరూపాయి నే అయిదు రూపాయలు గిడ తాయి ఇష్టం ఉంటే చెప్పు.'

'సరే' నంటున్నాడు ముష్టివాడు.

యువరాజు తనమీద తనే జాలిపడ్డాడు. తనని తనే ఏవగించుకున్నాడు. ఈ అధః పతనానికి తనే బాధ్యుడనుకున్నాడు.

ముష్టివాడిని వెళ్లిపోనిచ్చి క్లీనరుని పిలిచి తమలపాకులు వేసుకోమంటూ అర్ధణా ఇచ్చాడు. విస్తుపోయిన క్లీనరు ఒద్దనే లోగానే మెయిన్ రోడ్డు మీద నడుస్తున్నాడు యువరాజు.

డబ్బులు మూడణాలున్నాయి.

గుండె గతుక్కుమంది హఠాత్తుగా. ఇరవైగజాల దూరంలో తన ఇంటి ఓనరుడు వస్తున్నాడు. కనబడితే దుంప తెంపి ధూప మేస్తాడు. యువరాజు చటుక్కున వెనక్కి తిరిగి బయలుదేరాడు. మూడడుగులు వేసే సరికి అల్లంత దూరంలో___

ఈ యువరాజు ఇపుడు డెన్మార్కు యువరాజు పరిస్థితిలో పడ్డాడు, కొద్ది తేడాతో ___ అటు ఇంటివాడిని వరించ డమూ - యిటు నాయరు మానడాకి అటుకీ ఇటుకీ మధ్య ఒకటి ఎప్పుడూ ఉంటుంది. లేపోతే ఇటూ ఇటూ అనే ప్రస్తావనే లేదు. యువరాజుకి కూడా అటు ఇంటివాడికీ ఇటు నాయరుకీ మధ్య ఒక దారి దొరికింది. మధ్యనున్న కాఫీహోటలులోకి దూరాడు.

"వెయిట్ కూడా ఉండడమూ ఒద్దనూ అని మధనపడకుండా, చేతికి అంటిన డబ్బు తీసుకుని ఒఫీలియాని లేవదీసుకుని దేశాం తరం పోయి వుండచ్చు. తాపీగా దేవుడే సమస్య పరిష్కరించును." అనుకున్నాడు యువరాజు, తన తెలివితేటలకి ఉప్పొంగి పోతూ.

గండం గడిచిందిగానీ కంపు కాఫీ తాగి రెండణాలు హోటలువాడి ఏడాన పొయ్యాల్సి వచ్చింది. బయటకొచ్చి సిగ రెట్టు ముట్టించాడు యువరాజు. జేబులో అణా ఉంది.

చరచర పెద్ద పుస్తకాల కొట్లో కెళ్లాడు. విజ్ఞాన సముద్రం! అణువునుంచి బ్రహ్మాండం వరకూ, సిగరెట్లు ఎలా మానచ్చో మొదలు కులభిపాలల్లో నేర్పే అమెరికాయువు ప్రకం నించి ఆత్మసాక్షాత్కారానుభూతి సిద్ధింత డానికిమార్గదర్శివరకూ పుస్తకాలున్నాయి. మానవుడు చూచిన వేల సంవత్సరాల ఘడి యల, విఘడియల చరిత్ర గంభీరంగా పరు చుకుని ఉంది.

మానవుడు సృష్టించిన మహా విజ్ఞాన సాగరం మధ్య మానవుడే ఒక చిన్న చేపలా అబగా అంతా ఒక్కసారి జీర్ణంచేసుకోవా లనే ఆరాటంతో తిరుగుతున్నాడు. ఈ దేవాలయంలో ఉన్నంతసేపు మహోద్వే గంతో ఆలోచిస్తాడు. ఉత్తేజితుడవుతాడు. యువరాజు కేవలం ఉక్కిరి బిక్కిరయిపో యాడు. చాలా పుస్తకాలు కొనాలనిపిం చింది. చదవాలనిపించింది. కొనబోయి నంతపనిచేశాడు. జేబులో అణా కాసు గావుకేక వేసింది - నేనొక్కర్తినే వున్నా నోయ్ - నా మొహంచూస్తే పుస్తకాలివ్వరు అంటూ___

నాకు తెలుసులే - నువ్వు ఎత్తిపొడ వక్కర్లేదు అన్నాడు యువరాజు.



కాశీ హిందూవిశ్వ విద్యాలయం. (సంస్కృతశాఖ -ఇతరశాఖలు) ఫోటో: సి. సీతారాం. (మద్రాసు)



← పఠనమందిరంలోని ఒకభాగం

## మహారాజా యువరాజా

చదువుకుందామని బుద్ధి పుట్టి పుస్తకాలుకొనే తాహతులేని యువరాజుకి ఏహ్యత పుట్టుకొచ్చింది.

కనీసం ఒక్క పుస్తకం దొంగిలిస్తే-అన్న ఆలోచనదాకా వచ్చింది. బయటికొచ్చేశాడు అక్కడితో.

గుమ్మందాటుతో పెద్ద బ్రహ్మాండమైన కథ రాయడానికి నిశ్చయించాడు - తిన్నగా అమెరికా పంపివేసే ఒక్కసారిగా ఏపాతిక వేలో వస్తుంది. ఝాంమని చక్కని ఇంట్లో పెరట్లో స్విమ్మింగుపూలూ, చక్కని పెళ్లాం, మంచిరేడియో, చిన్న జర్మన్ కారూ, ఉంగరాలజుత్తుగల పల్లని తీగలాటి డ్రైవరూ, బొచ్చుకుక్కా, దానికి తోలు గొలుసూ ఏర్పాటు చెయ్యొచ్చు. ఈలోగా వరసగా పజిల్సు కట్టేస్తే మళ్లా ఏఁడో వచ్చి పడతాయి......

యువరాజుకి ఇంకో తియ్యని అనుమానం ఉంది. అది అస్తమానం రాదు. అసమర్థత కొట్టొచ్చినట్టు జ్ఞాపకంవస్తేనే ఆ ఆశని నెమరు వేస్తాడు.

ఈ తంతు జరిగినపుడు అతనికి ఎన్ని దృశ్యాలో కనబడతాయి...

...ఎక్కడో ఎవడో తన పేరుగలవాడు ఒక పజిలు కడతాడు. తనకు దారిద్ర్యంతో అవమానాలతో బతుకు బరువనిపిస్తుంది. ప్రేమించిన పడతి వరించదు–డబ్బు లేదని. వాళ్ల నాన్న అంతకన్నా వరించడు–బికారి వెధవ అని. అవమానితుడై ఆత్మహత్యకి పూర్నాడు ముహూర్తం నిశ్చయించుకొంటాడు. ఇంకోగంట టైముందనగా, తన మరణానంతరం తనజీవితపరిధిలో తొంగిచూసిన ఆడా మగా పిల్లా జెల్లా, తనమీద ఎలా జాలిపడతారో టెక్నికలర్‌లో ఊహించుకుంటాడు. ఇంతలో పజిలు కంపెనీ వాళ్లు నానా అడావిడిగా వచ్చి తనకి ఫస్టుప్రైజు వచ్చిందని చెప్పి, తన ఆశ్చర్యాన్ని గమనించకుండా, తనమాట వినకుండా, బంపర్ ఆఫరు లక్షరూపాయలూ నెత్తిన అంటకట్టి, పదివేల రూపాయలు తన దగ్గర టిప్ తీసుకు చక్కా పోతారు...

తనకి కసిపున్న వాళ్ళు ఉక్కిరి బిక్కిరి అయ్యేట్టుగా తన ప్రైజు వెల్లడిస్తాడు. నిన్న బికారి అని తిట్టిన 'వుడ్ - బి' మామగారు, ఆయన కూతురూ తన్ని శ్రీకరుడని పొగిడి పెళ్ళికి తయారవమంటారు.

ఈలోగా ఎవరి ప్రైజు తనకి పొరబాటు నొచ్చిందో అతన్ని వెతికి పట్టుకుంటాడు తను. నిజం చెప్పి డబ్బు తీసుకోమనేసరికి, అతడు మూర్ఛపోయి లేచి సగం డబ్బు నీకే అని ఇచ్చేస్తాడు.

న్యాయంగా ఆర్జించుకున్న ఈ డబ్బుతో.........

ఇక్కడితో యువరాజు కల ఆపేస్తాడు.

ఈ అనుమానం అతనికి చాలాకాలం నించి వుంది.

ఈసారిమాత్రం యువరాజుకి కొత్త మెఱుగైన ఆలోచన వచ్చింది – తనూ కట్టితే మంచిదని.

వెంటనే రోడ్డు మీద అర్ధరూపాయి కాసు దొరికేటప్పటికి, విధి వైచిత్ర్యం గురించి బోలెడు ఆశ్చర్యంతో గుండెలు బాదుకుని, శుభస్య శీఘ్రమనుకున్నాడు. మళ్ళీ మనసు మారకుండానే కిళ్ళీ కొట్టులో పజిలు కాయితం అడిగి పుచ్చుకొని పోస్టాఫీసు కలం సిరాబుడ్డి సహాయంతో నాలుగు చేడ చేడ ఎంట్రీలు నింపాడు. అంతకన్నా ఎక్కువ అనవసరం. ఆత్మవిశ్వాసం గలవాడికి తారువ వచ్చి పడాలి ప్రైజు.

అర్ధరూపాయికి పోస్టలు ఆర్డరు కొన్నాక కవరుకి డబ్బులు చాలవని జ్ఞాపకంవచ్చింది.

అలా పెట్టి బుక్‌పోస్టులో పంపితే, పోస్టలార్డరుకి రెక్కలొస్తాయి.

పోనీ 8 ఎంట్రీలు పంపుదామంటే మనసొప్పలేదు-మూడు నంబరు మంచిది కాదు. ముత్యం మూడు అనే సామెత సాయించలేదు. పైగా ఈ నాలుగోదే తనకు 70 వేలు తెచ్చేది కావచ్చు. అనక జుట్టు పీక్కుని ఘోరున ఏడవాలి. అలా కానూ పజిలు కాయితం, పోస్టలార్డరూ జేబులో వేసుకుని వేటకెళ్లాడు యువరాజు. కనీసం



॥ అంకముజేరి శైలతనయాస్తన దుగ్ధములానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున నవ్వలి చన్గబళింపఁబోయి యా
వంక కుచంబు గాన కహివల్లభహారముఁ గాంచి వేమ్రుణా
ళాంకురశంక నంటెడు గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్

చిత్రకారుడు: అడ్దివి హనుమంతరావు

# ★ మహారాజా యువరాజా ★

అణా దొరికితే చాలు. తిండి లేపు చూసు కోవచ్చు; ఎనిమిది గంటలయింది. అప్పిచ్చు వాడు ఎవడూ కనబడలేదు. కనబడ్డవాడు ఎవడూ అప్పివ్వలేదు.

నీరసం ఎక్కువైపోతోంది. కళ్లు చీకట్లు కమ్ముతున్నాయి. పసుపు పచ్చా, ఆకు పచ్చా, ముదర నీలంరంగులు కనబడు తున్నాయి. కళ్ళు మూసుకుంటేనేగానీ రోడ్డూ మనుషులూ కంటికి కావటంలేదు. తలలో నరాలు ఉండుండి కంపిస్తున్నాయి.

పళ్ళు పటపట కొరికి దవడలు పీకు తున్నాయి. శరీరంలోని ప్రత్యంగమూ యథాశక్తిని బాధపెడుతోంది. విపరీతమైన చలిగాలి వీస్తూంది పైగా వాన మొదలెట్టింది. ఇదే హోల్ సేల్ బాధ అంటే లోపలా బయటాకూడా హింస, అనుకున్నాడు యువరాజు. పోస్టలార్డర్నీ, పజిలు ఎంట్రీనీ చొక్కా కిందపెట్టి కాపాడుతూ—

అందమైన అమ్మాయిలు విలాసంగా వెళ్తున్నారు. కుర్రవాళ్లు ఈలవేస్తున్నారు. యువరాజు లేని ఉత్సాహం తెచ్చుకుని ఈల వెయ్యబోయాడు, కానీ పెదిమలు మండాయి. గొంతుకలో గులకరాయి అడ్డు నిలిచినట్టు నొప్పిపుట్టింది. ఈల రాలేదు.

కాఫీ తాగినా బాగుండును. అణాకి టీ వస్తుంది - సిగరెట్లు లేవు. గడ్డం పెరిగింది. పజిలు కట్టాలి. కాళ్లు పీకుతున్నాయి. రూముకి నడవడం అసంభవం...ఇంటివాడి అద్దె...

తల అడ్డంగా ఊటించాడు.

ఎదురుగా ఒక చిన్న హోటలుంది. జనం అట్టేలేరు.

చరచరనడచి వెళ్ళాడు. డబ్బులబల్ల దగ్గరికి - "చూడండి, నేను డబ్బు పారేసు కున్నా. మాయిల్లు దూరం. మీకేం అభ్యం తరంలేకపోతే ఈ పోస్టలార్డరు తీసుకుని అర్ధ రూపాయిచ్చెయ్యండి..."

"నాదేముందండి - ప్రొప్రయిటర్ని అడ గండి. అదుగో ఆయనే" అన్నాడు వాడు గట్టిగా.

ఒళ్లు చచ్చిపోయినట్టయింది. ఎవరూ విన లేదుగదా!

తెగించాడు కాఫీ తాగుతున్న ప్రొప్రై టరుదగ్గరచేరి మెల్లిగా చెప్పాడు.

'మాకెందుకండీఇది - అయినా అరణాలు తీసుకోండి' అన్నాడు.

ఆలోచించడం మానేసి 'ష్యూర్' అన్నాడు యువరాజు.

కృతజ్ఞతాపూర్వకంగా పోస్టలార్డరుతో పాటు తను నింపిన ఎంట్రీకాయితం ఇచ్చాడు - ఆల్ కరెక్టు వస్తుందని హామీ ఇస్తూ.

అరణాల్లో రెండణాలు కాఫీ తాగాడు. ఇందాక అణాతో కలిపి ఇంకా అయిదణా లుంది. చార్ మినారు సిగరెట్టుపెట్టీ, తెగిం చేసి అగ్గిపెట్టీ కొనేశాడు. మూడణాలు మిగిలింది. బస్సుకి బేసవుతుంది...మాసిన గడ్డంతో, అంతకంటె మాసిన బట్టలతో ఒక పెద్దమనిషి సమీపించాడు.

ఇంగ్లీషులో ఆరంభించి తెలుగుతో ముగించిన అతడి అభ్యర్థనసారం ఇది. అతని పర్సు పోయిందట. ఇల్లు దూరం. తప్పక వెళ్ళాలి. తనదగ్గర అణాస్టాంపు ఉంది. అది తీసుకుని అణా ఇస్తే...

యువరాజుకి ఏడుపు పొంగుకొచ్చింది. 'ఎటువేపు బస్సెక్కుతారు?' అన్నాడు. నయమే. తూర్పువేపు వెళ్ళే బస్సు. తను వెళ్ళేది పడమటికి—స్టాంపు తీసుకుని అణా ఇచ్చాడు.

ఆయన మళ్ళీ ఇంగ్లీషులో బాధపడి వెళ్ళిపోయాడు.

'నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్లు కొనండి' అంది బస్సుమీది బోర్డు.

"ఆఁ! ఆఁ! కొన్నామండీ. ఇప్పుడే" అనుకుంటూ అణాస్టాంపు చూసి నవ్వేడు యువరాజు.

బస్సెక్కి కిటికీదగ్గర కూచున్నాడు - 'అమ్మయ్యా' అని.

బస్సులో కూచుని పది నిమిషాలసేపు మరణించాడు యువరాజు. మెల్లిగా తిప్పు ప్రారంభమయింది. మరో మూడు నిమిషాలకి భరింపరానంతగా తిప్పసాగింది. కణతలు వేడెక్కాయి. ఒళ్ళు కాలిపోతోంది. కళ్ళు భగ్గుమంటున్నాయి. పళ్ళు గిట్టకరచుకొని బలి తట్టుకుంటున్నాడు. తను దిగాల్సినచోటు వచ్చింది. బస్సు దిగుతూనే భళ్ళున వాంతి అయింది. జనం చుట్టూ చేరి జాలిపడి, సోడా తాగమని సలహా ఇచ్చారు.

లేచి సోడాకొట్టు కెళ్ళాడు. స్టాంపు బయటకు తీసి మళ్ళా పాఠం అప్పచెప్పబోయాడు. "ఈ అణా స్టాంపు తీసుకుని.."

మతిపోయింది. కళ్ళు పెద్దవి చేసి మళ్ళీ పరిశీలించాడు. అది వాడిన స్టాంపు. దాని మీద ముద్రవుంది...

'కొంచెం మంచినీళ్ళు ఇస్తావోయ్. వాంతి అయింది' అన్నాడు.

మొహం కడుక్కుని బయల్దేరాడు రూముకి.

పది దాటింది.

ఇంటివాడు నిద్రపోయి వుంటాడు. మెల్లిగా రూము చేరితే హాయిగా దుప్పటీ కప్పుకుని కమ్మగా ఆలోచించుకుంటూ, ఆకపడుతూ పడుకోవచ్చు—

—తెల్లారకట్టే మళ్ళీ వాడు లేచేలోగా వెళ్ళిపోవాలి.

కోళ్ళదొంగ పద్ధతిలోవుంది, అనుకున్నాడు యువరాజు మేడమెట్లెక్కుతూ.

రెండు నిమిషాల అనంతరం వెచ్చగా దుప్పటీ కప్పుకుని పడుకున్న యువరాజుకి పొద్దుటి మహారాజు జ్ఞాపకం వచ్చాడు...

* * *

......పదిగంటలకి రోడ్డు కుళాయి దగ్గర పూటుగా నీళ్ళుతాగిన మహారాజుకి పులకమారింది. 'ఎవరో తల్చుకుంటున్నారు' అనుకున్నాడు. రాత్రి తొమ్మిది వరకూ కాలికి బలపం కట్టుకు తిరిగిన మహారాజుకి కానీ అప్పు పుట్టలేదు.

దాదాపు తనకి తెలిసిన పదిమంది 'స్నేహితులు' ఎన్ని బాధలు పడుతున్నారో, వాళ్ళదగ్గర ఇవాళ మధ్యాహ్నం దాకా ఉన్న రెండురూపాయలూ ఎలా ఎలా ఖర్చుపెట్టి యాతనలు పడ్డారో సవివరంగా విన్నాడు. సానుభూతి చూపాడు. కొందరికోసం కన్నీళ్ళుకూడా కార్చి తన తల తాకట్టుపెట్టైనా వాళ్ళకి అప్పుతెచ్చిపెడతానని హామీలు ఇచ్చాడు.

తొమ్మిదిన్నరకి వానలో నడుస్తూ తన పెళ్ళాం బిడ్డల మీదజాలి పడడానికి తనని తనే ఏవగించుకోడానికి ఉపక్రమించాడు.

తనకి పట్టాభిషేకం చేసిన పెద్దల్ని, ఆనాడు చందన తాంబూలాది సత్కారాలందుకుని ఆశీర్వదించిన పెద్దల్ని తిట్టుకున్నాడు. కొంపచేరేసరికి పెళ్ళాం బిడ్డలు మేలుకునుంటే బావుండదు. మొహం చెల్లదు. ఇత్తడి చెంబేదని పెళ్ళాం అడిగితే ఏం చెప్తాడు?

అప్పుదొరక్క వండలేదు - పిల్లలు పస్తున్నారంటే ఏమనాలి? అందుకే వాళ్ళు నిద్రపోయాక తను నిశ్శబ్దంగావెళ్ళి అరుగు మీద పడుకుంటేమంచిది.

పొద్దున్నే లేచి గట్టిగా ప్రయత్నించి - లేపోతే పెద్దమ్మకాళ్ళే పట్టుకుని మరో రూపాయి సంపాదించి ఇంటి మొహం చూడొచ్చు. మహారాజుకి ఆకలేసింది. తిరిగి తిరిగి వున్న మీద ఒళ్ళు తూలుతోంది. కోటూ పంచా తడిశాయి.

మంచినీళ్ళు తాగడానికి రోడ్డు కుళాయి దగ్గర ఆగాడు. ఎవరో మహారాజు విలాసంగా పాడుకుంటూ సైకిలుమీద వస్తున్నాడు. తెలిసినవాడేమో...సైకిలు వెళ్ళే వరకూ ఆగి కుళాయి నొక్కాడు. నోరు తెరిచాడు—ఒంగి. ఒక్కసారిగా ఏడుపు పెల్లుబికింది. గట్టిగా ఏడవాలనిపించింది. చుట్టూ చూశాడు. దగ్గరలో ఎవరూ లేరు. కుళాయిగట్టుమీద కూచున్నాడు. రెండు చేతుల్లో మొహంమూసుకుని, ఘోరున గుండెలవిసేలా నరనరాలూ కదలిపోయి నాభి కంపించేలా ఏడిచాడు.

నిమిషంసేపు తన ఏడుపు తనే విన్నాక కొంచెం బరువు తగ్గింది మరో కెరటం; పొంగింది - కుమిలికుమిలి ఏడిచాడు. వేడి కన్నీళ్ళు ధారాపాతంగా ప్రవహించాయి.

ఎంతో హాయి నిచ్చింది. ఆ ప్రవాహం; ఆ ఏడుపూ, అంతకన్నా భగవంతుడు చెంపలు నిమిరినట్లయింది.

చాలా రోజుల తరువాత ఈనాడు దేముడు జ్ఞాపకం వచ్చాడు. అప్రయత్నంగా ఆకాశానికి నమస్కరించాడు.

వెంటనే అటూ ఇటూ చూశాడు - ఎవరేనా చూశారేమో నని నవ్వుకో బుద్ధేసింది. కానీ నవ్వు రాలేదు.

కాస్త తేలికపడిన మనసుతో చల్లని నీళ్లు పెట్టి ముఖం కడుక్కున్నాడు. పొట్ట పూటుగా నీళ్లు తాగేశాడు.

పులకమారింది.

ఎవరో తలచుకుంటున్నారు గాబోలు అనుకున్నాడు, చొక్కాతో మొహం తుడుచుకుని ఇంటికి బయలుదేరుతూ...

## స్వస్తి

వెచ్చగా దుప్పటి కప్పుకుని విప్పారిన కళ్ళతో చీకటి చూస్తూ వెల్లకిలా పడుకున్న యువరాజు మహారాజును గుర్తుకు తెచ్చుకుని, అతనిదే జీవితమనుకున్నాడు. ఎక్కడెక్కడ తిరిగినా కొంప చేరేసరికి 'వచ్చారు' అనడానికి పెళ్లాం 'నాన్నా' అండానికి పిల్లలు...

ఎన్ని కష్టాలున్నా కలోగంజో తాగుతూ ఆనందాన్వేషణలో వున్న సుఖాన్నీ, సౌఖ్యాన్వేషణలో వుండే ఆనందాన్నీ పొందవచ్చు. 'నా' అన్నవాళ్లుంటారు.

గృహమే కదా స్వర్గసీమా...

సరిగ్గా, అదే సమయానికి ఓరగిలా వేసి ఉన్న తలుపును మెల్లిగాతీసి లోపలకెళ్లి పెళ్ళాం బిడ్డలు నిద్రపోతున్నందుకు దేముడికో దణ్ణం పెట్టుకుని, నిశ్శబ్దంగా మందం కదలకుండా శయనించి కొడిగట్టు దీపాన్ని చూస్తున్న మహారాజుకి యువరాజు గుర్తొచ్చాడు...

—ఏ సంసార తాపత్రయంలేని స్వేచ్ఛాజీవి. పక్షిలా విహరిస్తాడు. ఉంటే తింటాడు, లేపోతే గుక్కెడు నీళ్లుతాగి కడుపులో కాళ్ళెట్టుకు పడుకుంటాడు. బెంగా బెడదా వుండవు. అతనిపనే హాయి..

నిద్ర కుపక్రమిస్తున్న మహారాజూ యువరాజూ కూడా ఆకోరం ఏర్పడని, తమకే అర్థంకాని యీ కోరికలను నెరవేర్చవలసిందని పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తూ ఒకే ముహూర్తాన చేతులు జోడించి మనసా నమస్కరించారు.






## స్నేహాలు



ఈ ప్రపంచమనే విషవృక్షం రెండే మధుర ఫలాలని ప్రసాదిస్తుంది. అవి స్నేహమూ, కవిత్వమూ అన్నాడు ఓ జ్ఞాని. ఒక్క వ్యక్తితో అయిదు నిముషాలు మాట్లాడి అర్థం చేసుకోగలిగే విషయాలు ఒక్కొక్కప్పుడు వంద పుస్తకాలు చదివినా బోధపడవు. మానవ నైజాన్నీ తత్వాన్నీ గురించి లక్ష పుస్తకాలు చదవవచ్చు! ఉన్నత సంస్కారము దయ, ప్రేమ, స్వార్థత్యాగము. ఏ ఏ రీతులలో మనుష్యులలో కనిపిస్తాయో నవలలూ నాటకాలూ చదివి తెలుసుకోవచ్చు. కానీ ప్రత్యక్షంగా పదిమందిలో మాట్లాడి, వారిలో వున్న మంచిచెడ్డలనీ కష్టసుఖాలనీ పరిశీలించి, వారికి కలిగే వివిధ అనుభూతులని అర్థంచేసుకుంటే, జీవితానికి ఉపకరించే అనేక విషయాలని తెలుసుకోవటానికి ఎక్కువ అవకాశం వుంటుంది. ఈ జీవితంలో మనకి ఎంతమంది స్నేహితులుంటే అంత అనుభవం, ప్రపంచజ్ఞానం సంపాదించగలం అంటారు కొందరు.

కానీ వచ్చే చిక్కల్లా స్నేహం లభించడంలోనే. తమ అభిరుచులకీ, అభిప్రాయాలకీ అనుగుణంగా లేకపోతే యితరుల్ని నిమిషంలో దులిపి పారేస్తుంటారు కొందరు. కాఫీ డికాక్షను వడగట్టినట్లు, మనుషుల్ని వడగట్టి వారిలోవున్న మంచినే చవిచూడాలనీ, తతిమ్మా గుణాలన్నీ మాయమైపోవాలనీ అపోహ పడతారు. ఎదటివారిని అర్థంచేసుకుని, వారు అసలు ఎటువంటివారో తెలుసుకోకముందే, తమకి తెలిసిన నీతిధర్మ సూత్రాల ననుసరించి "వీరు మంచి" "వీరు చెడ్డ" అని నిర్ణయించి పారేస్తూంటారు.

తమ స్నేహాన్ని కోరే వ్యక్తులంతా, తమ అభిరుచులకి తగినట్లు వుండాలని కోరుకునీ, మార్పటానికి ప్రయత్నించీ ప్రయోజనం లేదు. అలా సంస్కరించటానికి పూను

**కొమ్మూరి ఉషారాణి**

కుంటే స్నేహితులూ కావలసినవారూ దూరమైపోతారు. అటువంటి మనస్తత్వమే తరువాత మనుష్యుల్ని నిరాశావాదులుగా మారుస్తుంది. ఆప్యాయంగా వుండే యిద్దరు వ్యక్తులని అతి సామాన్యమైన విషయాలే ఒక్కొక్కప్పుడు దూరం చేస్తాయి. ఒక్క మాట, ఒక్క నవ్వు, ఒక్క చూపుకూడా విభేదాలు తెచ్చే ప్రమాదం వుంటుంది. అంతమాత్రాన తమ ఆశయాలకి విరుద్ధంగా ప్రవర్తించారని వారికి దూరంగా తొలగిపోగూడదు. అలా తొలగిపోయేవారు నిజమైన స్నేహమెలాటిదో తెలుసుకోలేరు. కొన్ని పుస్తకాలలోనూ, వెండితెరమీదా "ఆహా! సోదరీ" అని అమాంతంగా వొళ్ళో పడిపోయే అసహజమైన స్నేహితురాండ్రని వాస్తవ జీవితంలో కలుసుకోవటం కష్టం. అలాటి స్నేహితురాండ్ర కోసం వెదికే వాళ్లకి స్నేహితురాండ్రు కనపడరు. దొరకరు. ఒకవేళ దొరికినా వారితో అభిప్రాయభేదాలూ, మనస్పర్థలూ తెచ్చుకుంటారు. వారి అనురాగాన్ని సంపాయించలేరు.

కనుపించే ప్రతి వ్యక్తినీ పలుకరించే వారినీ, అలసటలేకుండా అందరితో కబుర్లు చెప్పేవారినీ చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. స్నేహితులనిబట్టి వ్యక్తుల మంచి చెడ్డలని నిర్ణయించవచ్చునని యింగ్లీషు సామెతను మనసులో ధ్యానిస్తూ కాస్త హోదా, పలుకుబడీ, చదువూ వున్న వారినే స్నేహితులుగా ఎన్నుకోవటానికి తాపత్రయపడేవారూ వున్నారు. ఎంత తక్కువమంది స్నేహితులుంటే అంత మంచిదనీ, ఆ కొద్దిమంది కాస్త మంచివారుగా వుండేటట్లు ఏరుకోవాలనే హితవాక్యం వింటూంటాము. కానీ తమ స్నేహాన్ని అభిలషించేవారి



వ్యక్తిగత జీవితంతో సంబంధం పెట్టుకుంటూ, వారి సమస్యలని గురించి గంటల తరబడి ఆలోచించి, తాము కొలతబద్దగా పెట్టుకున్న నీతితో వారిని పరీక్షించ చూడటం అవివేకమేనని చెప్పాలి. తమ స్నేహితులంతా చాలా నీతిప్రదమైన జీవితాలు గడుపుతున్నారనీ, ఉన్నత సంస్కారాన్ని అలవరచుకున్నారనీ ఘంటాపథంగా గుండెమీద చెయ్యివేసుకు చెప్పటం కష్టం. అలాటివి తెలుసుకోవటానికి ఒక్కరోజు కాదు కదా ఒక జీవితకాలం కూడా పడుతుంది ఒక్కొక్కప్పుడు. తమ స్నేహాన్ని కోరే ప్రతివ్యక్తిని గురించీ "ఈమె భర్తతో సవ్యంగా కాపురం చేస్తోందా? సంఘం ఈమెని గౌరవిస్తోందా?" అని ఆలోచిస్తూ కూర్చుంటే, ఆ వ్యక్తితో హాయిగా ఓ అయిదు నిమిషాలు హృదయంవిప్పి కబుర్లు చెప్పలేము. స్నేహాన్ని వృద్ధి చేసుకోలేము.

పరిస్థితుల ప్రాబల్యంవల్ల, యితరుల పరిచయంవల్ల కొందరిని కలుసుకుంటాము. వారందరినీ జ్ఞాపకం పెట్టుకోవటం కష్టం. కొందరి ముఖాలు మాచాయగా మటుకు జ్ఞాపకముంటాయి. కొందరి ముఖాలు ఎప్పుడు చూశామో, ఎక్కడ చూశామో, బుఱ్ఱ బద్దలు కొట్టుకున్నా గుర్తుకురావు. తెచ్చి పెట్టుకున్న ఓ చిరునవ్వుతోనో, కుశల ప్రశ్నతోనో తప్పించుకుంటాము. కానీ అలాటి వ్యక్తులలోనే వుండే ఒక ప్రత్యేకత మనల్ని ఆకర్షించినప్పుడు, వారి స్నేహాన్ని కోరుతాము. "నీకు ఫలానా వ్యక్తి ఎందుకు నచ్చింది? ఎప్పుడు స్నేహితురాలయింది?" అనే ప్రశ్నలకి సమాధానం చెప్పలేము, స్నేహానికి పరిచయానికీ వున్న తేడా అదే.

అలా నూరుమందిలో ప్రత్యేకంగా తమని ఆకర్షించే వ్యక్తులలో వుండే యితర అలవాట్లనీ లోపాలనీ సహించే శక్తిలేకుంటే ఆ మైత్రి పుటుక్కున తెగిపోతుంది. తమ సౌఖ్యంకోసం తాపత్రయ పడేటప్పుడు, యితరులలో వుండే కొన్ని లోపాలని సహించే హృదయవైశాల్యమూ స్నేహశీలతా అలవరచుకోవాలి. కొందరు వ్యక్తులు స్నేహితుల్ని విచిత్రమైన ప్రభావంతో మార్చివేస్తారు. అలాటి మార్పుతో వచ్చే లాభనష్టాలని ఆత్మజ్ఞానంవల్ల నిర్ణయించుకోవచ్చు. కొన్ని సందర్భాలలో స్నేహితుల్ని తాము అనుసరించటానికో లేక వారిని తమవైపు తిప్పుకోవటానికో అవసరం కలుగుతుంది. ఆ రెండురకాల మార్పు జరగటానికి ఆ స్నేహితులు కొన్ని త్యాగాలు చెయ్యవలసి వుంటుంది. లేకుంటే ఆ స్నేహాలు అంతంత మాత్రంగానే వుండిపోతాయి.

ఈ పొరబాటు చేసేవాళ్ళే అతి సఖ్యంగా వున్నట్టు కనబడుతూ హఠాత్తుగా తెగతెంపులు చేసుకుంటారు. ఒకరోజు కొంగూ కొంగూ ముడివేసుకు తిరుగుతారు. మర్నాడు ఒకరు ఉత్తరంగానూ ఒకరు దక్షిణంగానూ వెళ్ళిపోతారు. "సామాన్యంగా స్నేహాలనేవి పరస్పర సంతృప్తికోసరం చేసుకునే ఏర్పాటులకన్నా ఎక్కువ కాదు" అన్నాడు ఓ ఆంగ్ల రచయిత. స్వలాభం కోసరం, అల్పబుద్ధితో స్నేహాలు కలపాలని ప్రయత్నించేవారు ఎదటివారిని ఎక్కువ కాలం మోసం చెయ్యలేరు. ఆ రకం స్నేహాలు కలకాలం వర్ధిల్లాలంటే యిద్దరికీ కొన్ని లాభాలంటూ వుండాలి. పరస్పరం ఎంతటి ద్వేషమున్నా మూడోమనిషిని విమర్శించ వలసినప్పుడు మటుకు దగ్గరగా జరిగే వ్యక్తులు ఈ జాబితాలోకే వస్తారు.

సామాన్యంగా పురుషులకంటే కూడా స్త్రీకి స్నేహితులెక్కువ కావాలనే కోరిక వుంటుంది. ఆడవాళ్ళు తగువు పోట్లాడుకుంటారనీ అయిదు నిముషాలు ఆప్యాయంగా మాట్లాడుకుంటే ఆరో నిముషం తగూలు తెచ్చుకుంటారనే వాదన ఒకటి వుంది. పల్లెటూళ్ళలో వుండే స్త్రీలకే గాకుండా, బస్తీల్లో వుండే స్త్రీలకి కూడా తరుచు బయటకివెళ్ళే అవసరమూ, పదిమందిని కలుసుకునే అవకాశమూ తక్కువ. సంవత్సరానికి ఏ రెండుసార్లో పేరంటాలకి వెళతారు. ఆ సమావేశాలలో అందరినీ పలుకరించి యోగక్షేమాలు కనుక్కోవటానికి వ్యవధి వుండదు. కానీ సినిమా థియేటర్లలోనూ, రైళ్లలోనూ, బస్సుల్లోనూ సాహచర్యంకోసం తాపత్రయపడుతూ స్త్రీలు నిముషంలో స్నేహాలు కలుపుకుంటారు. అలా సాహచర్యంకోసంమాత్రం స్నేహం ఆశించే స్త్రీల స్నేహాలలో అమాయకత్వమూ, నైర్మల్యమూ, స్వార్థరాహిత్యమూ గోచరిస్తాయి. అందుకనే సామాన్యంగా స్త్రీలు చేసుకునే స్నేహాలకి స్వకీయమైన ప్రయోజనం కానీ, స్వార్థంతో కూడుకున్న లాభాలు కానీ కారణాలు కావు.

వారి పరిచయాలు స్నేహాలుగా పరిణమించడానికి అటువంటి మనస్తత్వమే ముఖ్యకారణమని చెప్పాలి. తమ వ్యక్తిగత సమస్యలనీ, చిక్కులనీ ఒక్కమాటతో హృదయం విప్పిచెప్పి, యిద్దరు స్త్రీలు ఆత్మీయతను కలుగచేసుకునే మార్గం పురుషులకి చేతకాదని తోస్తుంది. ఇక్కడ ఓ విచిత్రమైన సంఘటనను చెబుతా.

నాలుగు వాక్యాలలో అతి సామాన్యమైన విషయంలో తన హృదయంలో రగులుతున్న ఆవేదననీ, తనకు జరుగుతున్న అన్యాయాన్నీ విప్పిచెప్పి ఒక యువతి మరొక యువతికి స్నేహితురాలైంది. రాత్రి ఎనిమిదిగంటలవుతుంది. పేవుమెంటుమీద కూర్చుని జాజిపువ్వు లమ్ముతోంది ఓ యువతి. వీధిలో జనం ఆట్టేలేరు. ఆ యువతికి పాతికేళ్ళకంటె ఎక్కువ వయస్సుండదు. చినిగిపోయిన చీరా, మాసికలు వేసిన రవికా, ఉంగరాలు తిరిగిన కురులతో పెద్ద బారుముడి. ఆ పువ్వులన్నీ రెండణాలకడిగిందట ఒకామె. ఆ పూలమనిషి ఆమెవంక భయంకరంగా చూసిందట. ఇవ్వను పొమ్మంది. అంత రాత్రివేళ ఆ పూలు ఎవరూ కొనరనీ, తనకే చౌకగా యివ్వమనీ ఎంతో బాధించి చూసిందట. కానీ లాభం లేకపోయిందట. ఏ ఆశతో ఆ పేదయువతి అలా కూర్చునున్నదో అర్థంకాక తిరిగి వస్తున్న ఆమెతో "ఈ పువ్వులు పావలాకీ ఓ కానీ తగ్గించి యివ్వను. జాజిపువ్వులంటే నాకు ప్రాణం. ఆ పావలాకోసరం పువ్వులన్నీ నా తల్లో







పెట్టుకోవాలనే కోరికని చంపేసుకుని పొయింత్రంనుంచీ యిలా కూర్చున్నాను" అన్నదిట. ఆ తరువాత ఏం జరిగిందో తెలియదు. కానీ ఆ ఒక్క సంఘటన మటుకు వారిద్దరినీ చక్కటి స్నేహితురాండ్రంగా మార్చివేసింది.

పుస్తకంలో పేజీలు తిరగవేసినట్లు మనం మనుష్యుల్ని చదవలేము. కానీ పదిమందితో స్నేహం చేసుకుంటే అనేక విషయాలని అర్థం చేసుకోగలుగుతాం. నచ్చి చిన్న పోట్లాటలూ, అభిప్రాయభేదాలు లేకుంటే స్నేహాలు రక్తికట్టవు గూడా. అవతలి వారి ప్రతిమాటకీ కళ్ళుమూసుకు తల వూపుతూ శాశ్వతమైన చిరునవ్వుముఖం పెట్టడం కాదు స్నేహమంటే. ముభావంగావుండే వ్యక్తులు గూడా అమాయకమైన, స్వార్థరహితమైన స్నేహానికి త్రోవచూపగలరనీ, పైకి ఎంతో ఆపేక్ష నటిస్తూండే వారు గూడా ఎంతటి హానినైనా తలపెట్టగలరనీ, లోభిత్వం, స్వార్థం, అసూయలవల్ల ఆప్యాయంగా వుండే వారికే దూరమైపోగలరనే విషయాలు తెలుసుకోవటం ముఖ్యమైన జీవితానుభవాలలో ఒకటి—కాదు మొదటిదేమో!

ఓ సారి స్త్రీల కంపార్టుమెంటులో ఎక్కిన ఓ ఇల్లాలు ప్రయాణీకులందరిలోను విచిత్రానుభూతిని కలిగించింది. చక్కగా పక్కపరచుకుని, బొటనవ్రేలైనా ముడిచి ఎవరికీ స్థలమివ్వనని మొండికేసింది. జనం రద్దీ ఎక్కువవుతున్నకొద్దీ, అందరికీ కూర్చునేందుకు సమానహక్కులు కావాలనే రగడ ప్రారంభమైంది. ఆ యిల్లాలుమటుకు వారితో హోరాహోరీ పోట్లాడిందేగానీ లొంగలేదు. చివరికి గార్డువచ్చి ఆమెను కూర్చోబెట్టవలసి వచ్చింది. ధుమధుమలాడే ముఖంతో అందరినీ మింగేదామన్నట్లు చూస్తూ ఓమూల నక్కింది. ఆ యుద్ధంలో ఎక్కువ గొడవచేసి ఆమెను దూషించిన ఓ అరవసోదరి ఆమె కెదురుగానే కూర్చోవలసి వచ్చింది. అందరికీ కొట్టేటంత స్థూలకాయం. ఏదో కొండజాతికి చెందిన అనాగరిక వ్యక్తిగా ఆమెని చూసి అసహ్యించుకొన్నవారూ నవ్వుకున్నవారూ వున్నారు. రైలు కదిలింది. సంచిలోనుంచి నాలుగు అరటిపళ్లుతీసి అందులో రెండు ఎదురుగా కూర్చున్న అరవామెకి యిస్తూ "ఇంద! తిను. ఎండ చాలా ఎక్కువగావుంది కదూ! మీ దేవూరు" అంటూ మాటలు కలిపింది ఆ యిల్లాలు. మేమంతా నిర్ఘాంతపోయాము. తను చేసిన పనికి పశ్చాత్తాపపడి గానీ, భయంవల్ల గానీ, అరవసోదరితో స్నేహం చేసిందంటే నమ్మటం కష్టం. సాహచర్యంకోసం స్త్రీలు తరుచు అలా మారిపోతారనీ, స్నేహంలో వుండే పవిత్రతా, మార్దవం, స్వార్థరాహిత్యమూ ఆ యిల్లాలికీ తెలుసుననీ ఒప్పుకు తీరాలి మరి.

స్నేహాన్ని పొందటమూ, పోగొట్టుకోవటమూ సులభమే నంటారు కొందరు. పోగొట్టుకోవటం మాట ఎలా వున్నా, పొందటంమటుకు అంత సులభంకాదని తోస్తుంది. తమకి లాభదాయకంగా వున్నప్పుడూ, వ్యవహారాలు ముగించుకోవటానికీ, కాస్సేపు కబుర్లు చెప్పుకోవటానికీ గాకుండా నిజమైన స్నేహాన్ని పొందకోరే వారు కొన్ని త్యాగాలని చెయ్యవలసి వుంటుంది. అది సాధ్యపడనప్పుడు పరాయి వాళ్ళకి కాదుకదా సొంతవాళ్ళకి దగ్గర కాలేము. ★

వనితాలోకం సీరియల్




## 14

కచేరీలో పని అయిపోయినా ప్రైవేట్ రూంలో దివాన్‌జీతో జమీందారు గారి సంభాషణ ముగియలేదు. హరినారాయణబాబు పెద్ద దిళ్ళకి చేరగిలపడి కూచుని, హుక్కా పీలుస్తూ కోడలి సుగుణాల్ని గురించి గొప్పగా చెపుతున్నాడు. అతడు చెపుతున్నదన్నీ బల్లమీద పరిచిన తివాసీ అంచున కూచునిఉన్న రాధానాథ బాపూలీ అతి శ్రద్ధగా వింటున్నాడు. ఇలాంటి సమయంలో నివారణుడు ముంగ మొహం పెట్టుకుని ఆ గదిలోకి వచ్చాడు.

హరినారాయణబాబు తన సంభాషణను చటుక్కున ఆపి, నివారణుడికేసి ఆశ్చర్యపోతూ చూశాడు. నివారణుడు రోజూ నియమంగా కచేరీకి వస్తాడు. తనకి ప్రత్యేకంగా ఉన్న గదిలో కూచుని, కచేరీ వ్యవహారాలు చూస్తూఉంటాడు. రోజూ వచ్చే మహాజర్లను, ఫిర్యాదుల్ని నివారణుడు చదివి వాటిమీద తన అభిప్రాయాన్ని సూచనప్రాయంగా రాసి జమీందారు దగ్గరకు పంపిస్తూ ఉంటాడు. తర్వాత జమీందారు వాటిని స్వయంగా పరిశీలించి దివాన్‌జీ సలహాకూడా తీసుకుని పరిష్కరిస్తూఉంటాడు. ఇవాళ నివారణుడు కచేరీకి రాలేదు. అతడు రాలేదన్న సంగతి హరినారాయణ బాబుకి తెలియకపోలేదు. కాని ఆ సమయంలో తన గదిలోకి నివారణుడు రావటం, పైగా ముఖం అలా ఉండటం - విచక్షణుడైన ఆ భూస్వామి బుర్రలో సంశయాల్ని రేకెత్తించాయి.

అతడు ఒక్క క్షణం నివారణుడికేసి రెప్పవాల్చకుండా చూసి, "ఇలాంటి అసమయంలో ఇక్కడికొచ్చావెందుకు నివారణ్? ఇవాళ కచేరీకి వచ్చి కూచోలేదుటగా! ఒంట్లో కులాసాగా ఉందా?" అని అడిగాడు.

నివారణుడు మామూలుగా తన కటువైన ధోరణిలోనే జవాబు చెప్పాడు - "చిత్తం. నా ఒంట్లో అయితే బాగానే ఉంది; కాని మనస్సే బాగా లేదు. అంచేతనే ప్రొద్దున మేడ దిగి కచేరీకి రాలేకపోయాను. మీరు పైకి వస్తారేమో అని ఇంతసేపూ ఎదురుచూస్తూ కూచున్నాను. మీరు రావటం ఆలస్యమవటం చూసి, గత్యంతరం లేక ఇహ నేనే ఇక్కడికి వచ్చేశాను."

నివారణుడు ఈ మాటలన్నీ ఇలా ఒక్క గుక్కలో చెప్పేశాడు- తాను చెప్పబోయే విషయానికి ఇది భూమిక అన్నట్లు...అసలు సంగతింకా అలా గుంభనగానే ఉంది. అది చెప్పటానికి ఈ వేళకాని వేళ పరుగెత్తుకొచ్చింది.

కొడుకు ముఖకవళిక - అతడి మాటల్లో ప్రచ్ఛన్నంగా ఉన్న అభిమానమూ, పనికట్టి—అతడీ అసమయంలో ప్రీతికరమైన విషయాలు మాట్లాడటానికి రాలేదని గ్రహించాడు తండ్రి. కొడుకు స్వభావం తండ్రికి తెలియనిది కాదు. అంచేత పైకి కృత్రిమమైన కుతూహలాన్ని వ్యక్తపరుస్తూ "అయితే ముఖ్యమైన సంగతేదో ఉండి ఉంటుం దనుకుంటాను?" అన్నాడు.

"చిత్తం!"

"అయితే నుంచున్నావెందుకు కూచో. ఆ విషయం ఏమిటో చప్పున చెప్పేసెయ్. ఇప్పుడు టైమూ చాలా అయింది. అదేమిటో వినాలని చాలా కుతూహలంగానూ ఉంది."

నివారణుడు దివాన్‌కేసి వక్రంగా చూసి, అప్రసన్నభావంతో - "నేను చెప్పదలచిన మాటలు మీతోనే...మీ ఒక్కరికే చెపుదామని ఉంది" అన్నాడు.

నివారణు డీమాట అనగానే దివాన్‌జీ లేవబోతూ "ఐతే ఇంక నే వెళ్ళివస్తాను. మీ మాటలు కానివ్వండి" అన్నాడు సంకోచిస్తూ.

హరినారాయణబాబు చెయ్యెత్తి వద్దని వారిస్తూ "బావుంది లక్షణం!...మన సంభాషణ యింకా పూర్తికాందే నీవు లేచివెళ్లటమేమిటి బాపూలీ?" అన్నాడు. తర్వాత కొడుకువైపుకి తిరిగి తీక్ష్ణంగా చూస్తూ "మన ఎస్టేట్‌కి సంబంధించినవికాని, మన గృహానికి సంబంధించిన వ్యవహారాలుకాని మన దివాన్‌గారియెదుట చెప్పకూడనివంటూ ఏవీ లేవని నీకు తెలుసుగా నివారణ్! ఇంక ఊరికే కాలహరణం చెయ్యక చెప్పదలచిం దేమిటో చెప్పు" అన్నాడు.

నివారణుడి ముఖం వివర్ణమయింది. సమర్థుడైన దివాన్ బాపూలీమీద అతడికేనాడూ అంత గౌరవం లేదు. తండ్రి అతడ్ని అత్యంత ఆత్మీయుడిగా భావించటం - పుత్రుడి ద్వేషపూరిత హృదయానికి కొంచెం కష్టంగానే ఉండేది. ప్రభు-భృత్యసంబంధంమాత్రమే ఉండవలసిన చోట - ఇలాంటి కృత్రిమమైన ఆత్మీయతాభావం - ఇసుకతో కట్టిన గోడలాగా, పేకమేడలాగా బలం లేనిదే అవుతుంది. అంచేత నివారణుడు ఎన్నడూ అతడియెడ గౌరవంగా ప్రవర్తించేవాడు కాదు. అదీకాక ఆఫీసు అడ్మినిస్ట్రేషన్ విషయంలో కూడా దివాన్‌తో అతడికి అభిప్రాయభేదాలున్నాయి. అలాంటి దివాన్ ఎదుట తండ్రి ఇలా నిగ్గతీసి అడగటం - కొడుకు మనస్సుకు ఆఘాతంగా తగిలిందంటే ఆశ్చర్యమేమీ లేదు. సహజమే...

మూలం : మణిలాల్ వంద్యోపాధ్యాయ    అనువాదం : మద్దిపట్ల సూరి



#  స్వయంసిద్ధ 

కాని ఇవాళ నివారణుడు దేనికైనా సిద్ధపడే వచ్చాడు. నిన్న కాక మొన్న వచ్చిన ఆ ప్రగల్భురాలైన వధువు తలవని తలంపుగా తమ సంసారంలో ఓ చిన్న విప్లవాన్ని లేకెత్తిస్తోంది. ఇప్పటివరకూ నిరాఘాటంగా సాగిపోతున్న తమ (తల్లీ కొడుకుల) శాసనశకటానికి అడ్డుగా వచ్చి నిలబడబోతోంది. అలాంటి ఆమెమీద తన తండ్రికి మనస్సులో ఎలాంటి అభిప్రాయం ఉన్నదీ ఇవాళ ఎలాగో అలా మథించి అయినాసరే తెలుసుకోవాలి. అంచేత ఇహ దివాన్ అక్కడున్నా అతణ్ని నిర్లక్ష్యం చేసి నివారణుడు తన ఈ విషమసమస్యా పరిష్కారాన్ని గురించి యోచించసాగాడు.

ఇంక తర్వాత ఉపోద్ఘాతమేమీ లేకుండానే "నేను మీతో ఓ పెద్ద ఫిర్యాదు చెయ్యటానికని వచ్చాను." అన్నాడు తండ్రితో.

నివారణుడు ఒకవేళ కత్తిచూపించి 'మిమ్మల్నిద్దర్నీ ఖూనీ చెయ్యటానికి వచ్చాను' అని అన్నా ఆ గదిలో తివాసీల మీద కూచున్న వృద్ధులిద్దరూ ఇంత ఉలిక్కిపడేవారు కారేమో! నివారణుడి నోటిమీదుగా 'ఫిర్యాదు' అన్నమాట వినేసరికి ఉభయులూ విస్మితులైనారు. నిజంగా విస్మితులవటానికి హేతువుకూడా ఉంది. ఇంతవరకు జమీందారుకాని, దివాన్ కాని ఎవరూ ఈ శేఫర్యాయువకుడు ఒక్కర్ని గురించి ఫిర్యాదు అంటూ చెయ్యటమనేది యెరగరు. నివారణుడికి విరుద్ధంగా ఎన్నో సార్లు - ఎన్నో చోట్లనుంచి ఫిర్యాదులు రావటం జమీందారుగారికి తెలుసు. కాని అతి డెన్నడూ ఫిర్యాదుచేసి యెరగడు. ఎవరైనా అతడి కోపానికి గురిఅయినారో వారిని తండ్రికి తెలియకుండా తానే విచారిస్తాడు. వాళ్ళకి తన ఇష్టంవచ్చిన శిక్ష విధిస్తాడు నిస్సంకోచంగా. అందాకా యెందుకు - ఎప్పుడైనా దివాన్‌జీ అతడి యిష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించినా సరే-తండ్రిదగ్గరకు రాకుండానే నిర్లక్ష్యంగా 'జ్ఞాపకం ఉంచుకోండి. సింహాశాబకాన్ని నేను. నాతో మాట్లాడేప్పుడు ఎప్పుడూ మర్యాద తెలుసుకుని మరీ మాట్లాడండి' అని అంటాడు. కొడుకు దుండగాలన్నీ ఎప్పటికప్పుడు తండ్రిచెవిని పడుతూనే ఉండేవి. కాని, శిక్షించటం విషయంలో మాత్రం అతడు కొంచెం ఉదాసీనంగా ఉండేవాడు. వ్యంగ్యంగా 'వాడి పేరే నివారణుడసలు. కనుక ఎవరు వారించబోయినా వాడు సహించడు' అనేవాడు.

పుత్రుడి విషయంలో జమీందారుగారి దౌర్బల్యాన్ని గురించి ఎన్నో వదంతులు, కథలూ ప్రచారమయినాయి. ఎన్నో ఆకాశరామన్న ఉత్తరాలు కూడా వచ్చేవి అతడికి. కాని అనుచిత వాత్సల్యం చూపించటం అనే దోషం తనయందు ఉన్నదని హరినారాయణబాబు తెలుసుకున్నా - ఈ దుండగుడైన కొడుకుని వారించటానికి కాని, శాసించటానికి కాని అతడెన్నడూ వృథా ప్రయాసపడలేదు. ఈ విషయంలో ఆయన మనస్సులో నిగూఢంగా ఉన్న అభిప్రాయమేమిటో ఆయనకే తెలియాలి.

అలాంటి దుర్దాంతుడైన నివారణుడు ఇవాళే మొట్టమొదటిసారిగా 'ఫిర్యాదు' చెయ్యటానికని అతడి ఎదుటికి వచ్చి నిలబడ్డాడు. అతడు కొంచెంసేపు అలా స్తబ్ధుడైపోయి నివారణుడి ముఖంకేసి చూస్తూ ఉండిపోయాడు. పెదవి కదిపి ఒక్కమాట మాట్లాడలేదు. 'ఇలాంటి సంఘటన నా జీవితంలో యెన్నడూ జరగలేదే! నివారణుడు ఫిర్యాదు చెయ్యటమా! తూర్పున ఉదయించే సూర్యుడు పశ్చిమాన ఉదయిస్తున్నాడా!' అని అతడు పూర్వస్మృతులను నెమరుకు తెచ్చుకుంటున్నాడల్లే ఉంది! ఆమాట తాను స్వయంగా తన చెవులతోనే విన్నాడు. విన్నబోయిన అతడి ముఖం ప్రత్యక్షంగా కన్పిస్తోంది. ఇహ విశ్వసించకపోవటం యెలా?...

ఒక్క క్షణమయినాక అతడు కొంత తమాయించుకుని, "నువ్వు నా దగ్గిరికి ఫిర్యాదు చెయ్యటానికని వచ్చావు... అవునా!... అయితే ఇదేదో మామూలు వ్యవహారంగా భావించటానికి వీల్లేదు. సరే... ఇంతకీ అసలు ప్రత్యర్థి యెవరు? ఎవరిమీద నీవు ఫిర్యాదు చేస్తున్నావ్?" అని అడిగాడు.

నివారణుడు తండ్రికేసి కళ్ళెర్రచేసి చూస్తూ "అయితే మీ రింతవరకు అసలేమీ గ్రహించనేలేదన్నమాట!" అన్నాడు మరింత కరుగ్గా...

అతడీమాటలనటం అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది. గది యావత్తూ భయంతో దద్దరిల్లిపోయేట్లు గర్జించాడా వృద్ధకేసరి. "నోరుముయ్ మూర్ఖుడా! ఫిర్యాదు చెయ్యటానికని వచ్చినవాడివి కళ్ళెర్ర చేస్తావెందుకు? ఇహనుంచి కొంచెం తగ్గి మాట్లాడటం నేర్చుకో"

ఇన్నేళ్లొచ్చాయి - ఎన్నడూ తండ్రి తనని ఇలా గద్దించి మాట్లాడటం యెరుగడు నివారణుడు. కఠినస్వభావుడైన తండ్రి యెదుట నిస్సంకోచంగా మాట్లాడగల ధీమా అతడికి ఒక్కడికే ఉంది. అతడెన్నో సార్లు తండ్రిమొహంమీదే ఇంతకన్న మరీ కటువుగా మాట్లాడాడు. అలాంటప్పుడు అక్కడున్న వాళ్ళంతా ఇతడిలా మాట్లాడటం చూసి ఉలిక్కిపడుతూ ఉండేవాళ్లు... కాని అతడెవర్ని గురించి యింత నిర్మోహమాటంగా మాట్లాడేవాడో, ఆతడి కనుబొమలుకూడా ముడివడేవి కావు. పైగా చిరునవ్వుతో అతడు తన ఔన్నత్యం చూపుకోవటం చూసి నివారణుడే విస్మితుడవుతూ ఉండేవాడు. దివాన్ రాధానాథబాబులీకూడా అలాగే నవ్వి ఊరుకునేవాడు. కాని ఇవాళ అంత గారాలకూచిఅయిన కొడుకును జమీం





దారుగారు ఇంతకఠినంగా మందలించటం చూసి అతడు కూడా తెల్లబోయాడు.

నివారణుడు కొంచెంసేపు మెదలకుండా ఊరుకుని, మనస్సులో తన సంకల్పాన్ని స్థిరీకరించుకుని, "అయితే నా ఫిర్యాదును కాగితంమీద పెట్టి ఇస్తాను" అన్నాడు.

"వద్దు. అదేమీ అవసరంలేదు. నువ్వు చెప్పాలనుకుని వచ్చిన దేమిటో ఇక్కడే చెప్పి వెళ్ళు" అన్నాడు తండ్రి...

"సరే, చెపుతాను. కాని ఇవాళ నేను చెప్పేది మీ మనస్సుకు నాటదని తోస్తోంది నాకు—"

"అనవసరమైన మాటలు మాట్లాడవలసిన ఆవశ్యకత ఏమీ లేదు. నీ ఫిర్యాదేమిటో-చెప్పు ముందు"

"మీరు ఎవరితోనూ సంప్రతించకుండా సామాన్య కుటుంబంలో పుట్టిన ఒక అమ్మాయికి కులవధువు అనే గౌరవమిచ్చి, అల్పురాలికి అధికృత కట్టబెట్టారు..."

"ఇది నీ ఫిర్యాదు కాదు నివారణ్! నేను చేసిన పనిని గురించిన అనధికార చర్చ—"

"కాని మీరు చేసిన పనిని ఇలా నిష్కర్షగా విమర్శించటం కొత్త కాదు నాకు"

"నువ్వు ఆ యోగ్యతను పోగొట్టుకున్నావ్. నీకింక ఆ అధికారం లేదు. నీ ఫిర్యాదెంతవరకో అదే వినదలచుకున్నాను నేను. నీముందర నేను చేసిన పనులకు సంజాయిషీ చెప్పుకునే సమయం రాలేదింకా."

"గోవిందుడి భార్యమీదనా ఫిర్యాదు-"

"చెప్పు - వింటాను."

"ఆవిడ అందరియెదుటా నన్ను అవమానపరిచింది."

"ఏం చేసింది?"

"మీరు ప్రధానానికి వెళ్ళినప్పుడు - ఆమె కొక బంగారుకొరడా బహూకరిస్తూ 'మా యింట్లో ఒక గాడిద ఉంది. దాన్ని ఈ కొరడాతో లొంగదీసుకోవా'లని చెప్పారటగా—!"

"చెపితే నీ కెందుకీ ఒళ్లుమంట?"

"ఆ గాడిదని నేనేనని, మీ రిచ్చిన కొరడాని నామీదే ఝళిపిస్తానన్నది ఆవిడ ...అందుకని"

"కోడలు నిజంగా అన్నదా ఆమాట?"

"చాలామందియెదట...సాక్ష్యానికేం లోటులేదు."

"ఆమాట అసలెందుకువచ్చింది? చెప్పు."

"ఆమె నన్ను చూడగానే మేలిముసుగు వేసుకుంది. ఆవిడముఖం ఎలా ఉంటుందో చూడాలనిపించింది. మీనాని మేలిముసుగు తియ్యమన్నాను—"

"నువ్వుచేసిన ఈ కాస్త తప్పుకే అంత రూఢమైనమాట అన్నదా?"

"అన్నదో లేదో ఆవిడ్నే అడగండి ముందు. మీరు ఆవిడకి కొరడా బహూకరించినట్లు, గంగూలీ వంశంలోని గాడిదని లొంగతీసుకోమని చెప్పినట్లు, ఈ సంగతులేవీ నా కిదివరకు తెలియవు. అసలావిడ నోటినుంచి బయటపడేవరకు నాకే కాదు, ఈ యింట్లో ఎవరికీ తెలియదనుకుంటాను."

"ఊఁ...తర్వాత? ఇంకా చెప్పవలసిందేమైనా ఉందా?"

"ఆవిడ మా తాతగారినికూడా అవమానపరిచింది."

"ఏమన్నది?"

"కీర్తిశేషులైన మా తాతగారిని గురించి పూలపాన్పు నాటి రాత్రి గదిలో ఉన్న అంతమంది పేరంటాళ్ళ యెదుట...ఎంత నాతప్పుమాట అన్నదో తెలుసా? ఆమాట వింటే మీరుకూడా కంపించి పోతారు."

"ఏమన్నది?"

"అప్పుల్లో మునగటంవల్ల ఆయన తన కూతుర్ని - మా అమ్మని-అమ్ముకున్నాట్ట."

"కోడలు అన్నదా ఈమాట! మా చండి"

నివారణుడు జేబులోంచి కాయితంతీసి, తండ్రి చేతికిచ్చి - "అప్పుడు అక్కడెవరెవరున్నారో, ఆవిడ ఈమాట అంటూండగా ఎవరైతే విన్నారో-వారందరి పేర్లూ ఇందులో ఉన్నాయి. నే చెప్పినమాట నిజమో కాదో దర్యాప్తుచేసి తెలుసుకోండి" అన్నాడు.

అప్పుడా కాగితంమీద రాసిఉన్న అక్షరాలన్నీ హరినారాయణ బాబు దృష్టికి పాముమెలికల్లా కన్పించసాగాయి. అతడి బుర్ర బాగా వేడెక్కింది. దృష్టి వెలవెలబోయింది. తాను ఎన్నెన్నో ఆశలు పెట్టుకున్న తన గారాబు కోడలిమీదనే ఇంతటి అభియోగమా? తన మామగారినే ఇంతమాట అనటానికి సాహసించిందా? ఎంత అహంకారం!

హరినారాయణబాబు కాస్సేపు నిశ్శబ్దంగా కూచుని ఆలోచించి, "సరే, ఇంక నువ్వు వెళ్లవచ్చు నివారణ్! నీ ఫిర్యాదు నేను స్వీకరించాను. విచారణలో లోపమేమీ జరగదు" అన్నాడు.

నివారణుడు మారు మాట్లాడకుండా ఒక్కసారి తీక్ష్ణంగా తండ్రిముఖంకేసి చూసి, ఆ గదిలోంచి మెల్లిగా వెళ్ళిపోయాడు.

(30- వ పేజీ చూడండి)





#  స్వయంసిద్ధ 

హరినారాయణబాబు దీర్ఘంగా నిట్టూర్చి "బాపూలీ! విన్నావుగా ఇదంతా?" అన్నాడు.

బాపూలీ యజమాని ముఖంమీద చూపు నిలిపి, "మీ ఊహాకి యెలా తోస్తోంది?" అని అడిగాడు.

"నివారణుడు అబద్ధం చెప్పలేదు. బంగారుకొరడా సంగతి ఈ యింట్లో మన యిద్దరికీ తప్ప ఇంకెవరికీ తెలియదు. రాణీకి కూడా తెలియదు ఆఖరికి."

బాపూలీ విచలిత కంఠంతో – "అయితే తమ ఉద్దేశం ఆమె నివారణుడ్ని —"

హరినారాయణబాబు ఉత్తేజితకంఠంతో బాపూలీ మాటకు అడ్డువచ్చి "ఆఁ. నాకే స్వర్ణగార్ధభం క్రింద కట్టింది. నా అభిప్రాయం గ్రహించలేదు. అక్కడే తప్పటడుగు వేసింది. సాధారణంగా ఆడవాళ్లంతా ఎక్కడ పట్టుబడతారో – ఈ అభాగ్యురాలు కూడా సరిగ్గా అక్కడే పట్టుబడింది" అన్నాడు.

"నాకొక్క విషయం తెలుసుకోవాలని ఉంది."

"అడుగు."

"ఈ విషయమై రాణీగారు మీతో ఏమయినా చెప్పారా?"

"ఉహూఁ. ఏమీ చెప్పకపోయినా, కోడలు వచ్చిందగ్గర్నుంచీ – ఆమెలో కొత్తంత గాంభీర్యం ఎక్కువయింది. ఆశ్చర్యం! ఇప్పుడు నాకు తోస్తున్నదేమిటంటే – ఆమె అన్నీ సంగతులూ వినే ఉంటుంది బాపూలీ. కోడలి ప్రవర్తన ఆమె మనస్సును కూడా బాగా గాయపరిచి ఉంటుంది."

"అయినా మీతో ఏం చెప్పలేదుగా!"

"నీకేమైనా పిచ్చా ఏం బాపూలీ! ఏమిటి నువ్వనేది? రాణీ ఈ వేలెడంత పిల్లమీద నాతో ఫిర్యాదు చేస్తుందా?"

"అదీ నిజమే. కాని నేనది ఆలోచించలేదు"

"ఆలోచించాల్సిన సమయం ఇహావచ్చింది బాపూలీ! ఇప్పుడనిపిస్తోంది – మనం వంశ గౌరవం అనేదాన్ని చులకనగా చూడకూడదని...అలా చూసినవాళ్లు మోసపోక మానరు. నేనుకూడా మోసపోయాననిపిస్తోంది బాపూలీ!"

"కాని నా దృఢవిశ్వాసం ఏమిటంటే – తమరు ఏయింటితో సంబంధం కలుపుకున్నారో – ఆ యిల్లు ఒక్క డబ్బువిషయంలో తప్ప మిగతా అన్నివిషయాల్లోనూ గొప్పదే. తమరు మోసపోలేదు."

"నేనూ అలాగే అనుకుంటూ ఉండేవాణ్ణి – కాని చేసింది పొరపాటేనని యిప్పుడు తెలుసుకుంటున్నాను. ఈ అమ్మాయిలో ఒక్క అంశాన్నే మనం చూడకలిగాం. ఆ విషయంలో మాత్రం జయపతాక చేబూని మనల్ని ఓడిస్తుంది. కాని మిగతా అంశాలమీదికి మనదృష్టి పోలేదు. ఈనాడదే సహింపరానిదయింది"

"మీయీ మాటల్లోని అర్థం నాకు సరీగా బోధపడటంలేదు"

"నువ్వు నిజంగా ఇంత అమాయకుడవా? లేక తెలిసినా తెలియనట్లు నటిస్తున్నావా? నా ఉద్దేశం ఏమిటో తెలుసా? నేనామెని కొంచెం అసాధారణురాలుగానే భావించాను. ఈమె మనోబలాన్ని గురించి – శారీరకబలాన్ని గురించీ తెలుసుకుని...దాంతోపాటు ఈమె అత్తవారింట అడుగుపెట్టటం మామూలు ఆడపిల్లలవలె కాదని – ఇంటిల్లిపాదినీ ఆత్మీయుల్నిగా చేసుకుంటుందని కూడా అనుకున్నాను. కాని రాగానే నివారణుడ్ని అఘాత పరిచినట్లు వాడి మాటలవల్లే తెలుస్తోంది. నివారణుడి మాతామహుని తప్పిదాన్నికూడా తెలుసుకుని అదొక పెద్ద దెబ్బకొట్టింది. రాణీసంగతి స్పష్టంగా తెలియదు కాని, బహుశా ఆమెకి కూడా ఇలాంటి అఘాత మేదో తగిలి ఉండక మానదని తోస్తోంది. ఈ యింటికి వచ్చి అందర్నీ తనకు శత్రువుల్ని చేసుకుంటోంది. తన భర్త అప్రయోజకుడు, గాడిదలాంటివాడూ అయినందుకు ఆమె మనస్సులో దుఃఖమేమీ ఉన్నట్లు కన్పించటంలేదు. ఐశ్వర్యాన్ని చూచేసరికి అన్నీ మరిచిపోయి ఉంటుంది."

"అయితే మీ రిప్పుడు ఏంచెయ్యాలని నిర్ణయించుకున్నారు?"

"నివారణుడిమీద అలా హుంకరించినా – ఇంకా గ్రహించలేదూ? ఉడుగోల పిండలాంటి యింత పిల్లవచ్చి నన్ను మోసగించటం, మా కుటుంబంలో విప్లవాన్ని తీసుకురావాలని ప్రయత్నించటం నే నేమాత్రం సహించబోను. శిక్షించి తీరాల్సిందే! అపరాధం చేసినవారెవరూ నానుంచి తప్పించుకోలేరు...

బాపూలీ ఆర్ద్రకంఠంతో – "అయితే నాదొక్క మనవి. ఆమె నిజంగా అపరాధి యన్న సంగతి మీకు రుజువైతే ఆమెని శిక్షించబోయేముందు —"

జమీందారు నవ్వుతూ "నీవు కబురు చెయ్యమంటావ్! అంతేనా! సరే, అలాగే.. కాని నీ సమక్షంలోనే ఆమెకి శిక్ష విధిస్తాను. శ్యామాపురం వెళ్లి ఆమెకి బహుమతి ప్రదానం చేసినపుడుకూడా ప్రక్కనే ఉన్నవాడివి కనుక – శిక్ష విధించబోయే టప్పుడు కూడా చెంతనే ఉండటం మంచిది" అన్నాడు.

ఆ మాట్లాడటం ముగించి జమీందారక్కడినుంచి లేచేసరికి బయట కామకుని హూమన్న భృత్యులందరూ కంగారుగా పరుగెత్తుకుంటూ వచ్చారు...

[ఇంకా వుంది.]





# భార్యాభర్తలు

రచన :
పెకింగ్ పీపుల్స్ ఆర్ట్ థియేటర్ గ్రూప్

అనువాదం :
మద్దులూరి రామకృష్ణ

[1953 చలికాలం - తొలిరోజు. ఆదివారం ఉదయం.

పెకింగులో ఫ్యాక్టరీ కార్మికుడు చాంగ్ ఇల్లు.

పాత్రలు: చాంగ్ - కార్మికుడు - వయస్సు 29.

భార్య: చాంగ్ భార్య వయస్సు 26.

సన్: పొరుగువాడు - ఫ్యాక్టరీ ఉత్పత్తి కమిటీలో మెంబరు - 25 సంవత్సరాలు.

ఆర్ ధిడ్: సన్ చెల్లెలు - 18 సం||

పెకింగ్‌లో మామూలు కార్మికుని ఇల్లు - చవిరంగావుండే ఆవరణలో దాబా-అంటులో ఉత్తరవైపు గది. గదిలోనుండి దొడ్డిలోనికి పోయే వాకిలి. వెనుక గోడ మధ్యలో ఒక పెద్ద కిటికీ. అందమైన రంగు కాగితాలు అతికించబడ్డాయి. కిటికీకి దిగువన మంచం - దానిపై మెత్తటి పరుపు. కుడివైపు గోడమీద చాంగ్ కుటుంబీకుల కొన్ని ఫోటోలు - మంచం ధాపున గోడకానించి ఒక ట్రంకు, డ్రాయరు. అల్లిక సామాను బట్ట-దుస్తులు. దాని ప్రక్క వంటసామగ్రి బీరువా. ఆ బీరువామీద వంటకు నూనె సీసాలు, ద్రాక్షరసం సీసాలు అనేక వంట పాత్రలు ఉన్నవి. బీరువా ప్రక్క ఒక నీళ్ల తొట్టె - ఎడమవైపు గోడప్రక్క కుర్చీ - టేబిల్. గోడకు తగిలించి చెంచాలు ఉన్న చిన్న బుట్ట. నీళ్ళతొట్టె కుడివైపుగా వంటయింట్లోకి పోయే వాకిలి. ఎడమ గోడప్రక్క ఒక కుర్చీ, టేబుల్. టేబుల్ మీద రేడియో, థర్మాస్ ఫ్లాస్కు, పుస్తకాలు. హాలుమధ్య కుడివైపున చదరపు టేబుల్. దానిచుట్టూ ఒక కుర్చీ-రెండు ఎత్తుపీటలు.

తెర ఎత్తగానే టేబిల్ ప్రక్క చాంగ్ ఒంటరిగా కూర్చొని తాను ఇవ్వబోయే ఉపన్యాసానికి సూచనలు మిక్కిలి శ్రద్ధతో వ్రాస్తూంటాడు. పక్కమీద బిడ్డ నిద్ర పోతూ ఉంటుంది. బజార్లో రొట్టెలు, బిస్కట్లు, నూనె అమ్మేవాళ్ల అరుపులు. నూనెలు అమ్మేవాడు కొయ్యపలక టకటకా కొట్టుతున్న ధ్వని.]

చాంగ్ : (తనలో ఉద్రేకంగా) ఈ పథకంవల్ల దేశానికి ఒక కోటిరూపాయలు మిగులుతాయి. వ్రాస్తాడు. అతని భార్య వంట గదిలోనుండి వేయించిన మాంసంముక్కలు పళ్ళెంలో పెట్టుకుని తెస్తుంది.)

భార్య: ఈ ముక్కలు నిన్న రాత్రి మిగిలిపోయినాయ్. మీకోసం మళ్ళీ వేయించుక తెచ్చా, రాండి, వచ్చి కాస్తిని తినిపోండి.

చాంగ్ : (వ్రాతలో మునిగిపోయి యథాలాపంగా) సరేలే!

భార్య: (ఒక కప్పులో టీ పోసి అతని ముందు పెడ్తూ) ఏమిటి రాస్తున్నారు?

చాంగ్ : (నిర్లక్ష్యంగా) కొన్ని సూచనలు.

భార్య: (అర్థంకాక) సూచనలా!

చాంగ్ : నేను చేసిన కొత్తపద్ధతినిగురించిలే - నేను దానిమీద ఒక రిపోర్టు ఇయ్యబోతున్నాను.

[చాంగ్ వ్రాస్తూ ఉంటాడు]

భార్య: తొందరగా తినండి.

చాంగ్ : వాటిని యిక్కడ వదలి పెట్టిపో. కొంచెంతాళి తింటాను.

[భార్య అతనిపనికి అడ్డురావటానికి యిష్టపడదు. పక్కవద్దకు వెళ్ళి చాంగ్ రాత్రి విడిచిన దుస్తులు తీసుకొని నీళ్ళ తొట్టెలో ముంచి వెనుకవాకిలిగుండా దొడ్లోకి వెళ్తుంది]

ఆర్ చిడ్: (తెరవెనుక) ఓ! ఎంత మంచి యిల్లాలివమ్మా! ఉదయం యింత పెందలాడే గుడ్డలు ఉతుకుతున్నావే!

భార్య: (తెరవెనుక) వీటిని ఆయన రాత్రి విడిచారు. ఇప్పుడు కొంచెం తీరిక వుంది కాబట్టి ఉతుకుతున్నాను.

ఆర్ చిడ్: (తెరవెనుక) ఈ తాడు తీసికొనివెళ్లి ఆ చివర కడతావు.

భార్య: (తెరవెనుక) ఎక్కడికి వెళ్ళుతున్నావు?

ఆర్ చిడ్: (తెరవెనుక) మహిళాగృహపరిశ్రమ కార్యాలయానికి.

భార్య: (తెరవెనుక) నీ వేదైనా పని తెచ్చుకోటానికి వెళ్తున్నావా? అయితే నాకుకూడా ఏదైనా పని తీసికొనిరా.

ఆర్ చిడ్: (తెరవెనుక) అన్నట్టు యీనాళ ఆదివారంకదూ? నీవు చాంగ్ అన్నతోనే ఈ వాళ గడపాలనుకుంటున్నట్టున్నదే.

భార్య: (తెరవెనుక) నీమాటలు నీవూ...

ఆర్ చిడ్: (తెరవెనుక) (నవ్వుకొంటూ) ఒక బొక్కెన నీళ్లు తెచ్చి పెడతానుండు.

భార్య: ఎందుకు నేనే వెళ్తాలే.

చాంగ్ : (వ్రాస్తూ ఉంటాడు. బిడ్డ ఏడుస్తూవుంటాడు) ఇదో - ఏం చేస్తున్నావు. (సమాధానం లేదు. చాంగ్ బిడ్డను తీసికొని లాలిస్తూవుంటాడు) ఉష్- మేల్కొన్నావే. ఏడవబోకయ్యా. ఏడవబోకు. నాన్న ఎత్తుకొన్నాడుగా. ఆఁ ఆ. (చాంగ్ టేబిల్ వద్ద కూర్చుంటాడు. ఒక భుజాన బిడ్డను ఎత్తుకొని వ్రాయటానికి ప్రయత్నిస్తాడు. బిడ్డ ఏడుస్తూంటాడు)

చాంగ్ : నివ్నే. ఏం చేస్తున్నావ్.

భార్య: (తెరవెనుక) ఆఁ వస్తున్నా.

[భార్య ప్రవేశిస్తుంది]

చాంగ్ : ఎక్కడికి వెళ్ళావ్. నీకు బిడ్డ సంగతికూడా శ్రద్ధలేదు.

(భార్య బిడ్డను తీసికొని సముదాయిస్తున్నది. కూరగాయలు అమ్మేవాడి కేకలు వినపడుతుంటవి)

భార్య: బయటకువెళ్లి కూరలు కొనుక్కొనిరారూ?

చాంగ్ : నువ్వు చూస్తూనే ఉన్నావుగా నాకు తీరికేది?



 

# భార్యాభర్తలు



భార్య: కాని నాకు చేతినిండా పని ఉన్నది.

చాంగ్: అబ్బాయి ఏడవటం లేదుగా వాడిని పక్కమీద పడుకోబెట్టు. వాడే హాయిగా నిద్రపోతాడు.

భార్య: (పిల్లవాడిని పక్కమీద పడుకోబెట్టి తాను కూరలబుట్ట తీసికొని బయలు దేరుతుంది.) ఏమండీ! అబ్బాయికంట కాస్త చూస్తూండండి. (భార్య బయటకు వెళ్లుతుంది. కొంచెంసేపుండి సన్ వస్తాడు.)

సన్: రావటానికి తయారుగావున్నావా?

చాంగ్: కాల్లో - సన్ - అంతా పూర్తయింది. అంతా వ్రాసి సిద్ధముచేశా. అక్కడికి వెళ్లి నేను చెప్పదలచుకొన్నదేదో మరచిపోకుండా చెప్పుతాను. ఈ కొత్త పద్ధతి వారికి మాటి మాటికి వివరిస్తే వాళ్లు బాగా స్పష్టంగా అర్థం చేసుకొంటారు.
బాగున్నది.

సన్: నేటి సమావేశం చాలా ముఖ్యమైంది. నీపద్ధతి అంతటా ప్రవేశపెట్టితే మన ఉత్పత్తిలో మంచి అభివృద్ధి వస్తుంది. చిక్కులన్నీ ఎట్లా విడదీశావో అందరికీ చెప్పటం మరచిపోకు.

చాంగ్: అయితే ఆ సంగతికూడా వ్రాయాలిసిందేనా?

సన్: సరే అలాగే చేయి. అయ్యాత్రం జ్ఞాపకం ఉంచుదా? ఈ నవీన పద్ధతికోసం ప్రయత్నిస్తుంటే మనయంత్రాలన్నీ పాతవి, పళ్లు అరిగిపోయినవి అని కొందరుఅన్నా, వాళ్లమాట చెలామణికాదు. నీ పద్ధతిగూర్చి గట్టిగా వాదించు. నీవు ఇప్పటికి 7 సార్లు ప్రయోగించి చూశావు. చివరికి సరియైన పథకం కనుగొన్నావు. దీనితో ఆ పాతపద్ధతి వదిలిపెట్టగలిగారంటే ఇంకా కొత్త పద్ధతులను కనుగొనటానికి వారికి ఉత్సాహం కలుగుతుంది.

చాంగ్: కార్మికులంతా ఉత్పత్తిలో నూతన విధానం కనుగొనవలెననియే కోరుతున్నారు.

సన్: వాళ్లు అనుకొంటే ఖచ్చితంగా చేస్తారు.

చాంగ్: ఈరోజు మీటింగుకు ఎవరెవరు వస్తున్నారు?

సన్: ఫ్యాక్టరీ డైరెక్టర్, ఫ్యాక్టరీ కార్మిక సంఘ ప్రధాన కార్యదర్శి, ట్రేడ్ యూనియన్ అధ్యక్షులు, ఫ్యాక్టరీ యువజన సంఘ ప్రధాన కార్యదర్శి ఇంకా చాలామంది.

చాంగ్: అబ్బా! అంతమందా! నేనెప్పుడు యింతకుముందు బహిరంగసభల్లో మాట్లాడలేదు. నీవుకూడా ఉత్పత్తి సంఘ సభ్యుడవే గదా! నేను మాట్లాడలేకపోతే నాబదులు నీవు మాట్లాడాలిసి వస్తుంది.

సన్: నీవు మంచి అవకాశాన్ని వదులుకొంటావా?

చాంగ్: రా! కూర్చో! సిగరెట్టు దమ్ము తియ్యి.

[సిగరెట్టు అందిస్తాడు.]

సన్: (టేబిల్ వద్దకు వెళ్ళి వేయించిన మాంసం ముక్కలు చూస్తాడు.)
బాగుంది. నీ కన్నా మా రొట్టెలున్నా, ఇవాళ మాంసపు ముక్కలూ.

చాంగ్: కూర్చో, రెండు తినిపోదువు.

సన్: (ఒకటి తింటూ) ఊ. చాలా రుచిగా ఉన్నవి. నీవు నిజంగా అదృష్టవంతుడవు. మా అక్క నీ విషయం చాలా శ్రద్ధతీసికొంటుంది సుమా. ఇంట్లో యేది కావలసిఉన్నా నీవు పట్టించుకోవలసిన అవసరం లేదు. పొద్దుకే రొట్టెలతో మేపుతుంది. నీదే భోగమంటే.

చాంగ్: ఇందులో ప్రత్యేకత ఏముంది. అందరి భార్యలలాగానే ఆమెకూడా చేస్తున్నది.

సన్: అలా అనబోకయ్యా - మా చెల్లెలు ఎప్పుడూ నీ భార్యను పొగడుతూనే వుంటుంది. ఇంటి విషయం ఆమె శ్రద్ధ తీసికోకపోతే నీ కృషిలో ఎట్లా సంపూర్ణంగా నిమగ్నుడవు కాగలవు?

చాంగ్: ఏం మాట్లాడుతావయ్యా. ఆమె లేకపోతే నేనేమీ పని చెయ్యలేనన్నమాటేనా? మీ చెల్లెలు ఆర్చిడ్ ఎప్పుడూ ఆమెను అంటిపెట్టుకొనే ఉంటుంది. వాళ్ళిద్దరూ అదోకరకం.

సన్: మళ్ళా అదేమాట. ఆలస్యమై పోతూవుంది. నేను ముందువెళ్ళి అన్ని ఏర్పాట్లు చేస్తుంటాను. నీవుకూడా తొందరగా రా. కచ్చితంగా మనం 8-30కి మొదలుపెట్టాలి. ఇంకా గంటన్నర టైమున్నది. పదింటికి చైనా, సోవియట్ మిత్రమండలివారు మనకోసం ఒక సినిమా చూపిస్తున్నారు. జాగుచేయకు. నీకోసం ఎదురుచూస్తుంటాము.

చాంగ్: నేను సరిగా వేళకు వస్తా! కాస్త వ్రాయటం పూర్తికాగానే బయలుదేరుతా.

సన్: నేను వెళ్లుతున్నా.

(చాంగ్ భార్య బుట్టనిండా మాంసం, కూరలతో వెనకవాకిలివద్ద సన్‌ను కలుసుకుంటుంది.)

భార్య: ఏం సన్. కాసేపు ఆగవేవా?

సన్: నేను త్వరగా ఫ్యాక్టరీకి వెళ్ళుతున్నా. అక్కడ ఒక తొందర పని వున్నది. ఇవాళకూడ మాంసమేనా? (ఆశ్చర్యంతో)

భార్య: ఇవాళ ఆదివారంకదూ. ఆయనకు ఈనాడు ఏదైనా బాగా చేసి పెట్టుదామని ఉన్నది. ఫ్యాక్టరీనుంచి తిరిగివచ్చిన తరువాత మాతో విందారగించు.

సన్: సరే! అలాగే. (సన్ వెళ్లును)

భార్య: (బుట్ట కింద వుంచి టేబిల్ వద్దకు వెళ్ళి) ఇదిగో చూడండి. వేపుడు ముక్కలు చల్లారిపోయినవి. మీరు వాటిని తింటారా లేదా?

చాంగ్: (జవాబు యివ్వడు)

భార్య: మళ్లా వేయించమంటారా ఏమిటి.

చాంగ్: నాకేమీ అక్కర్లే. కావాలంటే వేయించుకొని నీవే తిను.

భార్య: నేను తింటం అయిపోయింది. (కొద్దిగా ఆగి) ఆదర్శ ప్రజారోగ్యమండలి సమావేశం ఏర్పాటు చేయబోతున్నాము.

చాంగ్: (విసుగుగా) ఊహూం.

భార్య: ఆదర్శ ప్రజారోగ్య మండలి సభ్యులుగా వుండతగినవారి లిస్టు తయారు చేశాం.

చాంగ్: విసిగించబోకు. నేనెంత తొందరపనిలో ఉన్నానో చూడటం లే!

భార్య: ఎప్పుడూ తొందరే! తొందర!! తొందరలో వున్నప్పుడు ఒక్క మంచి మాటన్నా రాదు. (ఆమె టేబిల్ మీదఉన్న ప్లేటు తీసికొని వంటగదిలోనికి పోతుంది. చాంగ్ వ్రాత ముగించి ఫ్యాక్టరీకి పోబోతుంటాడు. డిజైన్ డ్రాయింగు కనిపించక కంగారుపడుతుంటాడు)

చాంగ్: ఆ డ్రాయింగ్ ఎక్కడుంది?

భార్య: దేనికోసం వెతుకుతున్నారు మీరు?

చాంగ్: (మాట్లాడక వెదుకుతుంటాడు)

భార్య: నాకు చెప్పండి. దేనికోసం వెతుకున్నారో.

చాంగ్: నీకు తెలియదు. నేను చెప్పినా అర్థంకాదు.

భార్య: ఏం మనుష్యులండీ మీరు. దేనికోసం చూస్తున్నారో చెప్పరు.

చాంగ్: ఫ్యాక్టరీలో మరచి వచ్చానేమో. (అని జాకెట్ వేసికొనును)

భార్య: మీ రెక్కడకు వెళ్లుతున్నారు?



చాంగ్: ఫ్యాక్టరీకి.

భార్య: ఇవాళ ఆదివారం. ఇప్పుడు అక్కడేమి చేస్తారు?

చాంగ్: నాకు పనుందిలే. (అతనిని ఆపు వలెనని భార్య అనుకొంటుంది కాని అతడు త్వరగా బయటకు వెళ్లుతాడు)

భార్య: (చాంగ్ టేబిల్ మీద వదిలి వెళ్లిన చిన్న కాగితం మడచి డస్కుమీద నున్న రేడియో క్రింద పెట్టుతుంది.)

అగ్-చిన్: (తెర వెనుక) అక్కా! అక్కా!! (వెనుక వాకిలినుండి లోనికి వస్తుంది.) అక్కా! అబ్బాయిని లేపబోకు.



# భార్యాభర్తలు



కోసం కొంత పనితీసికొని వచ్చా చేసిన అల్లిక పనికి వచ్చిన డబ్బు యిదుగో! ఈసారి యీ డబ్బుతో నీవు తప్పకుండా కొత్త గుడ్డలు కొనుక్కో.

భార్య: లేదు-లేదు! ఈసారి చాంగ్ కు ఉన్ని మఫ్లర్ కొనాలని అనుకొంటున్నా.

ఆర్ చిడ్: నీలాంటి మంచివాళ్లు అరుదమ్మా! నీ వెప్పుడూ చాంగ్ నుగురించే ఆలోచిస్తుంటావు నిన్న కొన్న గుడ్డను చాంగ్ కు కోటుకుట్టావా? నీకు తీరిక లేకపోతే నేను కొంత సాయంచేసి పెడతా!

భార్య: నీవేమీ సాయం చేయనక్కరలేదు. నే నెప్పుడో దాన్ని పూర్తిచేశా.

ఆర్ చిడ్: అప్పుడే ఎక్కడ చేశావమ్మా! నీకు తీరికఎప్పుడు చిక్కింది?

భార్య: కొన్నాళ్లనుండి ఫ్యాక్టరీనుంచి పొద్దుపోయి వస్తున్నారు. అందాకా నేను చేసేదేమున్నదని ఆ పని చేస్తుం డేదాన్ని. చలి బాగా తిరుగుతున్నది. ఆయన చాలా శ్రమ చేస్తున్నారు. జలుబు చేసుందేమో. చాంగ్ కు జలుబు చేస్తే నాకు చాలా కష్టంగా ఉంటుంది.

ఆర్ చిడ్: నేను చెప్పలేదూ. నీ వెప్పుడూ ఆయననుగూర్చి ఆలోచిస్తుంటావని. (వెంటనే జ్ఞాపకం తెచ్చుకొని) ఓహో!! (తన జేబులోనుంచి కాగితం ముక్క తీసికొని ఆమెకు యివ్వబోతుంది.)

భార్య: ఏమిటది?

ఆర్ చిడ్: మహిళా గృహపరిశ్రమ సంఘ నాయకురాలు యిది నీకు పంపింది.

భార్య: దానిలో ఏమున్నదో చెప్పు.

ఆర్ చిడ్: నేను చెప్పేదేమున్నది. అందులోనే అంతా వ్రాసివున్నది.

భార్య: అదేదో చదివి వినిపించుదూ.

ఆర్ చిడ్: అది నాకోసం వ్రాసింది కాదుగా. నే నెందుకు చదువుతాను.

భార్య: ఓసి టక్కరిపిల్లా. నాచేత బలవంతంగా చదివించాలని చూస్తున్నావే!

ఆర్ చిడ్: (కాగితం యిస్తూ) నీవు చెప్పింది నిజమే. నీయంతట నీవే చదువుకో.

భార్య: (అయిష్టంగా చీటి తీసికొని జేబులో కూరుతుంది)

ఆర్ చిడ్: (చేయి పట్టుకొని) ఏమిటే! నీవు చేసే పని.

భార్య: నేను నిదానంగా తరువాత చదువుకొంటానులే.

ఆర్ చిడ్: చదవడం ఎట్లాగో నేర్చుకోవడంవల్ల ఏమిటి ప్రయోజనం. ఈరోజు నీచేత ఆ చీటి చదివించి తీరుతాను.

భార్య: నిజంగా యిప్పుడేనా? అయితే చదవడం నాకేమీ చేతకాదమ్మా.

ఆర్ చిడ్: నిన్ను చూచి నే నేమి నవ్వను. నవ్వుతానని అనుకొంటున్నావా?

భార్య: సరే! ప్రయత్నిస్తాను. నాకు రానిచోట నీవు సహాయం చేయాలి.

ఆర్ చిడ్: నేను తప్పక సాయం చేస్తాగా.

భార్య: (చదువుతుంది) రెండుజతల - అల్లిక - పనిగల - అల్లికపనిగల (ఈమాటలు యేమిటి చెప్పు).

ఆర్ చిడ్: "దిండు."

భార్య: రెండుజతల దిండ్ల గ-లీ-బు-లు

(ఆర్ చిడ్ ఊ-ఊ-అంటుంది.)

ఆర్ చిడ్: అక్కా!

భార్య: అవును. చూడమ్మా. (చదువుతుంది) మజూరి రెండు రూపాయలు.

ఆర్ చిడ్: ఆ, అంతా చదివావు కదూ ఏమి ఫరవాలేదమ్మా ఎన్నాళ్లనుండి బదులు వెళ్లకున్నావ్.

భార్య: ఏమీ ఫర్వాలేదంటావా? మూడు నెలలనుండి వెళ్లుతూంటే ఈ కాస్త వచ్చింది. కాని మిగతావాళ్లు నాకన్నా చాలా మెరుగు. పైగా నేను పిల్లవాడిని కూడా తీసికొని వెళ్లాలి. అక్కడ వాడు ఏడుస్తాడు. సముదాయించాలి. ఇంకా యితరులకు కూడా ఆటంకం అనే నా భయం. ఇదంతా చాలా చిక్కుగా వుంది. నా బుఱ్ఱ మట్టిదిలాగుంది. చదివిన కాసేపైనా జ్ఞాపకముండదు. పుస్తకం మూసేసి యింటి పనులు చూచుకుంటుంటే అంతకు ముందు చదివింది కూడా మరచిపోతాను. ఆర్చిడ్! వాళ్లకు అతివేగంగా చదువు నేర్పాలని కుతూహలం. రోజుకు వంద మాటలు నేర్పాలనిఉబలాటపడతారు. నాకు నేనేమి అందుకోలేనని భయంగావుంది.

ఆర్చిడ్: ఎందుకు నేర్చుకోలేవమ్మా! ఎందుకూ పనికిరావని అనుకోటం నీలోని బలహీనత. నీవేమీ తెలివితక్కువదానివి కావు. కష్టపడి చదువుకొంటావు. చదువు మీద పట్టుదల వదలకుంటే నీవు తప్పక జయం పొందుతావు. నీ కెందుకీ భయం. పిల్లవాడివలన కొంచెం యిబ్బంది ఉన్నదనుకో. కొద్దికాలంలోనే ప్రభుత్వం సహకార శిశు సంరక్షణాలయం తెరుస్తుందని విన్నా. అప్పుడు నీ బిడ్డసమస్య పరిష్కారమవుతుంది.

భార్య: అది జరిగేదాకా ఏం చేసేటట్లు?

ఆర్చిడ్: చాంగ్‌కు ప్రతిరాత్రి పని ఉండదుగా మరి! రాత్రి పాఠశాలకు వెళ్లేటప్పుడు పిల్లాడిని చాంగ్ దగ్గర వదలి వెళ్లవచ్చుగా ఆయనకు అంత తీరని పనివుంటే మా అమ్మవద్ద వదలిపో.

భార్య: (నిట్టూరుస్తూ).

ఆర్చిడ్: అక్కా. ఏమిసంగతి.

భార్య: ఆఁ ఏమీ లేదు.

ఆర్చిడ్: అయితే ఉన్న చిక్కేమిటి.

భార్య: నీకు తెలియదులే. ఆయనకు పని లేకపోయినా బిడ్డవిషయంలో ఏమీ సహాయం చెయ్యనివారు పిల్లాడి నేమి సముదాయిస్తారు. పోయినసారి ఒక నోటు పుస్తకం కొనుక్కొని రమ్మంటే కొనుక్కొని రానేలేదు. చివరకు నేనే కొనుక్కోవలసివచ్చింది. ఆయన ఎప్పుడూ నేను చదవటంలేదని, నాకు చదువురాదని అంటూవుంటారు. కాని నేను నిజంగా చదువుతూ ఉన్నప్పుడు ఆయన కాస్తయినా సహాయం చేయరు. నీవూ, మీఅమ్మ సాయం చేయకపోయినట్లయితే ఈ మాత్రమైనా అక్షరాలు వచ్చివుండేవి కావు. నా కష్టాలసంగతి ఆలోచించదైనా ఆలోచించరు. కుటుంబ విషయాలు బొత్తిగా పట్టించుకోరు. ఫ్యాక్టరీ విషయాలు అడిగితే చీదరించుకొంటారు. ఆ విషయాలు నీకు తెలియవులే అంటారు. నేనెందుకూ పనికిమాలినదానిని అని ఆయనఅభిప్రాయం. నేను నిజంగా అంత తెలివితక్కువదానినా?

ఆర్చిడ్: నీవు తెలివితక్కువదానివని అంటానికి ఆయనకేమి హక్కున్నది? ప్రజారోగ్యదళాలలో మనదళం చాలా గొప్పది. మన జట్టులో ప్రతివాళ్లు నీవు మంచి నాయకురాలివని పొగడుతూ వున్నారు. ఇతరజట్లుకూడా నిన్ను పొగడుతూఉన్నవి. ప్రజారోగ్యసంఘానికి నిన్ను అధ్యక్షురాలుగా ఎన్నుకొనే అవకాశాలు కనిపిస్తున్నవి. అక్కా నీవు ఆయనమాటలు పాటించకు. నీవు చేసే మంచిపని విడువకు. త్వరలోనే ఆయన నీసేవను గుర్తిస్తాడు.

భార్య: అవును. మునుపు నేనెప్పుడూ నాలుగోడలలోపలే వుండేదాన్ని. చదివేదాన్ని కానేకాదు. నాకు అప్పుడు ఏమీ తెలిసేదికాదు. ఇప్పుడు అలాగాదు. ప్రజారోగ్యకార్యక్రమమునుగూర్చి నాకు కొన్ని కచ్చితమైన అభిప్రాయాలున్నవి. సభలో మాట్లాడాలంటే కాళ్లువణికేవి. కాని ఇప్పుడు పెద్దపెద్ద చర్చలలో పాల్గొంటున్నాను. ఏదైనా నివేదిక వింటుంటే విషయాలన్నీ బాగానే తెలుస్తున్నవి. అనేకవిషయాలు అర్థంచేసుకొన్నానని నా యభిప్రాయం. సమావేశంనుండి యింటికి వెళ్లుతూ దారిలో ఈ విషయాలన్నింటినీ గురించి ఆయనతో మాట్లాడాలని అనుకొంటానుగాని తీరా యింటికి వెళ్ళిన తర్వాత ఆయన నామాటలే వినిపించుకోరు. నేనంటే ఆయనకు ఏమాత్రం ఆదరణలేదు.

ఆర్చిడ్: చాంగ్ ఈ విషయంలో పొరపాటు పడ్డాడు. నిన్ను యింకా పూర్వంలాగానే చూస్తున్నాడు. కాని యిప్పుడు మహిళలంతా మారిపోయారు. వాళ్లు ట్రామ్‌లు, రైళ్లు, విమానాలు, టాంకులు సహితం నడుపుతున్నారు. ఏ విషయంలోనైనా మనం మగవాళ్లలాగానే రాణిస్తున్నాం. ఆయన ఆ బూజుపట్టిన పాత భావాలను దులిపివేసికోవాల్సి ఉన్నది. ఆయనతో ఈ విషయాలనుగూర్చి గట్టిగా మాట్లాడు.

భార్య: నిజమే - ఈలా ఎన్నాళ్లో సాగటానికి వీలులేదు. నేనే ఈ విషయం తప్పక ఆయనతో మాట్లాడి తీరుతాను. (గడియారం 9 కొట్టుతుంది) అయ్యో! టైం అయింది. ప్రజారోగ్య కార్యక్రమం ఎలా జరుగుతుందో తనిఖీ చేసిరావాలి. మరచిపోయా. ఉదయంనుండి నా మనస్సు చికాకుగాఉంది. (నిద్రపోతున్న కొడుకును చూస్తుంది) చూడు - ఇవాళ ఆదివారమైనా పెందలాడే యింటికొచ్చారేమో ఆయన. నీవు ఈ బిడ్డను కాసేపు చూస్తుండు.

ఆర్చిడ్: తప్పకుండా. మాయింటికితీసికెళ్లుతా. నీవు సమావేశానికిఆలస్యం చేయకు.

భార్య: ఆలస్యము చేయను. పిల్లాడి గుడ్డలు రెండు తీసుకెళ్లు. వంటయింట్లో అరగట్టాను. (భార్య వెళ్లుతుంది.)

[సశేషం]





# లోభి

నార్ల చిరంజీవి

పిల్లికి బిచ్చము పెట్టడు
మెతుకైనా విదలింపడు
కొంపలలో దీపమార్పి
కోటికి పడగెత్తినాడు.

ఇరుగు పొరుగు మంచిచెడ్డ
ఇసుమంతయినా తలపడు.
చమురు దండుగనుచు దివ్వె
సంజవేళ వెలిగింపడు.

ఖర్చగునని తలచి అదుత
కబళమైన తినజెప్పడు
చిల్ల పెంకునైన నరే
చేయిజారి పోనీయడు.

* * *

ఇటులుండగ పిసినారికి
చటుకున మసకలు క్రమ్మెను
కాలు కదపరాని పాడు
కంటి జబ్బు వచ్చి పడెను.

"వైద్యుని బిలిచిన వ్యయమగు
వాడూరక రాడుకదా?"
అని లో లో మథన పడుచు
అను కొన్నా డాఖరి కిటు:

"పసువైద్యుడు ఉచితముగా
పశువైద్యము చేయుచుండు
చక్కగ అటకేగితినా
జబ్బు పోవు, డబ్బు మిగులు."

* * *

రాగిడబ్బు కోరకుండ
రక్తమువలె ఎఱ్ఱనైన
ద్రావకమును రెండుకనుల
తలమునుగగ పోసినాడు.

పాపము, మనపిసినారికి
పైసలు పోలేదుకాని
గుడ్లు రెండు లొట్టలుపడి
గుడ్డితనము వచ్చెతుదకు.

* * *

న్యాయాధిపు చెంతకేగి
'నాకన్నులు పోగొట్టెను
పశువైద్యు' డటంచు చెప్పి
పరిహారము కోరె లోభి.

వివరమెరిగి న్యాయమూర్తి
వినిపించెను తనతీర్పును:
"పశువైద్యుడు పశువైద్యమె
చేయుటది నిజమె, న్యాయమె.
గాడిదలును గుఱ్ఱములును
పోవలసిన వైద్యుకడకు
పోతివి మనిషివై కూడ.
గొడ్లమందు కురుక నేల?
గుడ్డికంటి కేడ్వనేల?"



మైసూరు మహారాజుకు ఏనుగులు అనేకం. వాటిని ప్రాణప్రదంగా పెంచుతారు. కాని, వారి ఏనుగొకటి ఒకసారి మగ పిల్లను ఈనింది. ఆ గున్నకు పదహారుగోళ్లుమాత్రమే ఉన్నై! పద్దెనిమిదిగోళ్లు గల ఏనుగలు మాత్రమే శుభకరమైనవనీ, పదహారుగోళ్లే గల ఈగున్న అశుభకరమైందని ఆస్థాన శాస్త్రజ్ఞులు చెప్పడంచేత,

కె. పి. బాబు

రాజుగారు ఆ గున్నని - అప్పట్లో తాము వేలంపాడేస్తున్న ఇతర వస్తువులతో కలిపి అమ్మివేయాల్సిందని ఆజ్ఞాపించారు......

ఆంధ్రదేశంలోని వర్తకప్రముఖులలో వెంకట్రామయ్యగారొకరు. ఆయన వ్యాపారార్థమై మైసూరుకు పోయినప్పుడు వెంకట్రామయ్యగారికి పై సంగతి తెల్సింది. తెల్సుకొని వింతపడి సర్దాగా ఆయన ఆ వేలంపాటను చూడబోయారు.

# గున్నడి ఘనకార్యాలు

చూడటానికి ఆ ఏనుగుగున్న మాంఛి బలిష్టంగానూ నల్లగానూ వుంది. కాని, అమాయకంగా తోకా తొండం వూపుతూ జాలిగా చూస్తుంటే వెంకట్రామయ్యగారికెంతో జాలేసింది! మహారాజుగారికి పనికిరానట్టి వస్తువులనెన్నో అనేకమంది ఆ వేలంపాడి కొనుక్కొని పోయారుకాని, ఈ ఏనుగుగున్నని మాత్రం ఎవరూ పాడలేదు, పాడే సూచనలూ కన్పించడంలేదు! "అయ్యో! గజరాజుగా ప్రసిద్ధికెక్కవలసిన ఈగున్న డెంత దౌర్భాగ్యస్థితి పొందుతున్నాడు!" అని చాల బాధపొందాడాయన. ఆ వూహల్లో వుండగానే ఆయనకు తన గారాబాల చిట్టిబాబు గుర్తుకొచ్చాడు. తను మహాభవనంలో ఒంటరిగా గంతులేస్తూ ఆటలాడుకొనే కొడుకు గుర్తుకు రాగానే ఆ కన్నతండ్రి మనస్సు తరుక్కుపోయినట్లైంది. తక్షణం, అప్రయత్నంగా ఆగున్నని కొనడానికి వేలంలో పాల్గొన్నారు. అశుభకరమైనద్దాన్ని ఒక్కసారిగా వెయ్యినూటపదార్లకు పాడారు. అనుకోనివిధంగా మరెవ్వరో "పన్నెండువంద"లన్నారు. దానితో వర్తకశ్రేష్టికి రోషమొచ్చింది. "పదిహేనువంద" లన్నారు. అంతే! ఆగున్న వెంకట్రామయ్యగారి సొత్తయ్యింది.

* * *

వెంకట్రామయ్యగారు గున్నడిని కొనితేవడం ఒక్క చిట్టిబాబుకి తప్ప మరెవ్వరికీ ఇష్టం కాలేదు.

వారిది బ్రహ్మాండమైన భవనం. దానిచుట్టూతా అందమైన ఫలపుష్పవనం! అనేకమంది దాసదాసీజనం! వెంకట్రామయ్యగారు గున్నడిని పోషించడానికేమాత్రం శ్రమపడాల్సిన అవసరం కలుగలేదు. పెరట్లో ఒకమూల చక్కని ఆశ్రయం గున్నడికి కల్గించారు. ఒక ముసలి సాహేబుని మావటిగా జీతానికి నియమించారు. తమకు చిట్టిబాబెంతో, వాడికి గున్నడంత! కనుక - తాము చిట్టినెట్లా సంరక్షిస్తారో, అట్లానే గున్నడినీ కాపాడాలని వెంకట్రామయ్యగారు ఆదేశించారు!......

చిట్టిబాబుకి ఒక మిత్రబృందం ఉంది. వారందరకూ గున్నడి రాకతో క్రొత్తవిధు లేర్పడినట్లయింది. క్రొత్తపద్ధతులలో వారు తిరుగనారంభించారు. రోజూ వేళకి స్కూలుకి వెళ్లిరావడం, అంతా ఇక గున్నడితోనే కాలక్షేపం! ఆ పిల్లల ఆదరాభిమానాలతో, ఆటపాటలతో అతిత్వరలోనే గున్నడు తల్లినీ, ఇతర ప్రపంచాన్నీ అంతా మరిచిపోయాడు. వాడికింక ఇదే లోకం - ఇదే సర్వం అన్పించేటంత స్నేహంగా ఉండేవా రాపిల్లలు! ముసలిసాహేబు పేరుకేగాని గున్నడికి మావటి చిట్టిబాబే, నిజానికి!...

చిట్టిబాబు "గున్నా" అని కేక వేస్తే చాలు - ఎక్కడున్నా "ఓ" యన్నట్లు తొండమెత్తి ఘీంకారం చేసేవాడు! "కూర్చోరా" అంటే కూర్చునేవాడు. "లేవరా" అంటే లేచేవాడు. వంగుకోమంటే వంగుకొనడం, నడవమంటే నడవడం, పరుగెత్తమంటే పరుగెత్తడం - ఇలా ఏది చెప్తే అది - చెప్పడం ఆలస్యంగా కుశాగ్రబుద్ధిలా గమ్మత్తుగా చేసేసేవాడు గున్నడు. వాడి చేష్టలు రానురాను పిన్నపెద్దలందరకూ ముచ్చట కల్గించాయ్. త్వరలోనే వాడు అందరకూ ఇష్టుడై పోయాడు.

ఇట్లా ఉండగా కొంతకాలానికి - ఆవూరికి అమెరికన్ సర్కస్ వచ్చిందొకటి! ఆ సర్కస్‌వాళ్లు ఆవూరిలో మకాం వేసిన నాటిమధ్యాహ్నము చిట్టిబాబు, మరికొందరు మిత్రులతో కలసి అలవాటుప్రకారం గున్నడిని స్నానానికని ఊరిబయట ఏటికి తీసుకువెళ్లాడు. అక్కడ రోజూ స్నానంచేసేస్థలంలోనే సర్కస్ ఏనుగులను కడుగుతున్నారు. అది చూచి గున్నడు పౌరుషంతో ఘీంకరిస్తూ చిందులుత్రొక్కనారంభించాడు. పిల్లలంతా కోలాహలం చేయసాగారు. ఒడ్డున నిలబడి ఏనుగులని స్నానం చేయిస్తున్న సర్కస్ పనివాడు జాన్ తనవెనుక మరో క్రొత్త ఏనుగుగున్న అల్లరి తెలుసుకొని, వెనుతిరిగి చూచాడు. చూచి నిశ్చేష్టుడై పోయాడు. ఎదిగినకొద్దీ గున్నడు నల్లగా భయంకరమైన విగ్రహంగా నూతనులకు అదురు పుట్టేటట్లు కన్పిస్తున్నాడు. మరి ఆ సర్కసవిశేషకి ఏనుగులేమోగాని చూస్తుంటే పీనుగుల్లాగున్నాయ్!

అంచేత ఆ తెల్లవాడు తనటోపీ తీసి చంకలో పెట్టుకొని నోటిలోని పైపు చేతబట్టుకొని తనముందు నిలచినపిల్లలగుంపునీ కోపంతో గంతులేస్తున్న గున్నడినీ, వాడిపి మంగ

లిస్తూ సమాధానపరుస్తున్న చిట్టిబాబునీ తదేకదీక్షతో చూస్తూ నిర్ఘాంతపోయాడు ఆ తెల్లవాడు తేరుకొనేలోగానే గున్నడతని చెంతకు పరుగులెత్తాడు. వాడి నెక్కివున్న చిట్టి "ఆగు" అని గట్టిగా అరచాడు. లేకుంటే జాన్ ఏమైవుండేవాడో. కాని - గున్నడు మాత్రం ఉక్రోషంతో, క్రోధంతో ముందు కడుగు వెయ్యడానికి వీల్లేక ఘీంకరిస్తూ నిలచిపోయాడు! గున్నడి పరవళ్లు ఆపిల్లల కెంత ఉల్లాసపర్చాయో, అంతకుమించి భయభ్రాంతులు కల్గించాయి జాన్‌కి!...జాన్‌కి తెలుగంతగా రాదు. చిట్టిబాబుకి ఇంగ్లీషూ అంతంతమాత్రంగానే వచ్చును. వాళ్లిద్దరూ సంభాషించుకోవలసి వచ్చింది. చిట్టిబాబు గున్నడిని దిగకుండగానే ఎదుట నేలమీద నిలచిన జాన్‌తో మాట్లాడాడు. వాళ్ళిద్దరూ సగం తెలుగూ, సగం ఇంగ్లీషూ కలిపి సైగలు చేసుకొంటూ సంభాషించారు. "మీదీ వూరేనా?" అనడిగాడు జాన్. "అవునండీ" అన్నాడు చిట్టి. "ఈ ఏనుగు?" "మాదే!" "మీ సొంతిందా?" "అవునండీ"... ఈ మాటకి మహాశ్చర్యపడ్డాడు జాన్. ఈలోగానే పిల్లలంతా మరో రేవులో జలకాలాడనారంభించారు. జాన్‌తో సంభాషించడం ఇష్టంలేనట్లుగా అలిగిన గున్నడు ఆ రేవుకి గబగబా నడక ప్రారంభించాడు. చిట్టిబాబు ఆగమన్నా ఆగకుండా గున్నడు జాన్‌ని త్రోసుకొని ముందుకు సాగిపోయాడు. జాన్ తృళ్ళిపడ్డాడు. చిట్టిబాబునీ, అతని మిత్రబృందాన్నీ - ముఖ్యంగా గున్నడినీ వాడి చేష్టల్నీ అలానే పరిశీలిస్తూ నిలబడిపోయాడు...

తమ గుడారాలు చేరుకోగానే జాన్ సర్కస్‌మానేజరైన మైకేల్‌కి గున్నడిగురించి తాను చూచినదంతా పూసగ్రుచ్చినట్లు వర్ణించి వివరించి చెప్పాడు! ఒక వ్యాపారస్థునికి సొంతఏనుగు ఆ వూరిలో ఉండడం, అది ఒక కుర్రాడి చెప్పుచేతల్లో నడవడం, మైకేల్‌కి విచిత్రంగానే తోచింది! ఆనాటిసాయంకాలమే వెంకట్రామయ్యగారింటికి జాన్‌తో కలసి మైకేల్ వెళ్లాడు. వాళ్లు ఆ భవనం చేరేవేళకి తోటలో పిల్లలంతా బంతి ఆట ఆడుతున్నారు. చిట్టిబాబుకి గున్నడే గోల్‌కీపర్! తనవంకకి వచ్చే బంతిని గురి తప్పకుండా తన ముంగాలితో "ఠప్పీ" మని కొట్టి పంపేస్తున్నాడు. ఏ సమయంలోకూడా తొండంతో బంతిని ముట్టుకోకుండా, గోలు కానివ్వకుండా ఆట ఆడుతున్న గున్నడిని చూచి సర్కస్ మానేజర్ మైకేల్ చకితుడయ్యాడు. చిట్టిబాబు వాళ్లనిచూచి లోనికి ఆహ్వానించి గౌరవించాడు. గున్నడుమాత్రం వాళ్లని క్రోధంతో చూస్తూ, తొండ మాడిస్తూ భయంకరంగా ఘీంకరించాడు. జాన్‌కి గుండెలదిరాయి. కాని, మైకేల్ మాత్రం నిశ్చలంగా, నిర్భయంగా గున్నడిని పరిశీలనగా చూస్తూకూర్చున్నాడు. ఆతోటలోనే వాళ్లకి కుర్చీలువేసి కూర్చుండబెట్టి, టీ పార్టీ ఇచ్చి ఆతిథ్యం నెరపాడు చిట్టిబాబు. ఒక పెద్ద సర్కస్ యజమాని స్వయంగా వచ్చి తన పెంపుడు జంతువు విద్యలని ప్రదర్శించి చూపమని తన్ను కోరి, గౌరవిస్తాడని కలలోగూడా తలవని కారణంచేత చిట్టిబాబు మైకేల్ కోరిందే తడవుగా అమితోత్సాహంతో గున్నడి విద్యల్ని ప్రదర్శింప బూనుకొన్నాడు. తన కిష్టం లేనట్లుగానే గున్నడు ఒకటి తర్వాత ఒకటిగా అనేకరకాల వింత వింతపనులని అద్భుతంగా ప్రదర్శించాడు. తన్మయుడైన మైకేల్ "తన సర్కస్ మొత్తం మీద అటువంటి తెలివితేటలుగల జంతువే లేదని" పొగిడాడు. కుర్రాళ్ల కందరకూ చక్కిలిగింతలు పెట్టినట్లైంది!...

కాని, మైకేల్ పైకి అలా ఆప్యాయంగా కన్పించినా అతని ఆలోచనంతా గున్నడిమీదనే వుండిపోయింది. నిజంగా ఆజంతువు తన సర్కస్‌లోనే వుంటే—? ఎటువంటి పేరు—ఎంతడబ్బు వస్తుంది! కాని, ఏవిధంగా గున్నడిని తమ సర్కస్‌లో చేర్చుకోవడం? ... ఇదే ఆలోచనలతో మైకేల్‌కి కాలం గడిచిపోసాగింది. ఆ సర్కస్‌ని చూస్తున్న ఆ ఊరిప్రజలంతా ఆ సర్కస్ జంతువులన్నీ ఒకఎత్తు, గున్నడొక ఎత్తుగా భావిస్తూ—ఆజంతువులన్నీ గున్నడి ముందు బలాదూరంటే — బలాదూరనుకోవడమూ అతనికి తెల్సింది. ఇక ఉండబట్టలేక పోయాడు.

వెంకట్రామయ్యగారి వద్దకు మోటార్ సైకిల్ మీద మైకేల్ వెళ్లాడు. వెళ్ళి ఆ మాటా ఈ మాటా చెప్పి, తుదకు తన మనోగతాభిప్రాయం విప్పిచెప్పాడు. "గున్నడి వంటి జంతువు ఉంటే అరణ్యంలో, లేకుంటే సర్కస్సులలోనే

# ★ గున్నడి ఘనకార్యాలు ★

తప్ప ఇళ్లల్లో పిల్లలతో ఉండటం ఒకనాటికైనా బహు ప్రమాదకర మని నచ్చజెప్పా, "మీరు దాన్ని అమ్మదలిస్తేమట్టుకు ఏదో ఒకధరకి తానే కొనుక్కుని పోతా"నని తెల్పాడు. అంతా సావధానంగా విని వెంకట్రామయ్యగారు ఉగ్ర స్వరూపం దాల్చారు. "బిడ్డలముఖ మెరుగని గొడ్డుమోతులూ, కసాయిలూ కూడా గున్నడివంటి జంతువును ప్రాణాలడ్డువేసైనా కాపాడుకొంటారు. ఇప్పుడైతే అడిగావుగాని, మరోసారిలా మాట్లాడితే బాగోదుసుమా!" అని గట్టిగా మందలించారు. మైకేల్—అప్పటికైతే తమాయించి పోయాడుకాని, అతనిలోని మంట అభివృద్ధిచెంది పొగలూ, సెగలూ వెలిగ్రక్కనారంభించింది!...

వెంకట్రామయ్యగారు జరిగిన సంగతి ఏమాత్రం ఇంట్లో చెప్పివున్నా ఈ కథ ఇంత అయివుండేదే కాదేమో—కాని, ఆయన జరిగిన సంగతిని అలక్ష్యంచేసి ఎవరికీ చెప్పకుండానే ఊరుకొన్నాడు. అంచేతనే ఏమీ ఎరుగని చిట్టి ఆనాటిరాత్రే గున్నడినెక్కి సర్కస్ చూడబోయాడు. అతన్ని చూచి మైకేల్ ఎదురొచ్చి సర్కస్ చూడమని ఆహ్వానించాడు. దానితో ఉషారెక్కి చిట్టిబాబు గున్నడిని సర్కస్ ఏనుగుల డేరాలోనే ఒకవంక నిలిపి, తానేమో సర్కస్‌ని చూడ్డానికి వెళ్లాడు ...

అక్కడ సర్కస్ రంజుగా సాగుతోంది. ఇక్కడ తప్పత్రాగినజాన్, మైకేల్ ఇద్దరూ కలిసి గున్నడి ముందు తందనాలు త్రొక్కుతున్నారు. చుట్టుప్రక్కల్లో జనసంచారం లేదు. ఆ త్రాగుబోతుల మత్తు వదిలేట్లుగా గున్నడు వారిని చూస్తూ క్రోధంతో ఘీంకరించాడు. దుష్టబుద్ధి గలవారు తా మాశించినది దొరకనప్పుడు, వాటిని నాశనంచేసైనా సంతృప్తి చెందడానికి ప్రయత్నిస్తారు! అట్లాగే చేయాలని ఆలోచించారు ఆదుర్మార్గులిద్దరూ! అటూ ఇటూ చూచి, తమకు దగ్గర్లో ఎవరూ లేకపోయేవేళకి మైకేల్ తన కోటు జేబులోనుండి బ్రాందీబుడ్డి తీశాడు. కొంతత్రాగి ఆబుడ్డిని బుసలుకొట్టుతూన్న గున్నడి కందించాడు. అలవాటు చొప్పున అరటిపండు నందుకొన్నట్లా బ్రాందీబుడ్డిని తొండం చాపి అందుకొని, మైకేల్ త్రాగినట్లే త్రాగివేశాడు గున్నడు. ఉత్సాహంతో ఒకసారి ఘీంకారం చేసి ఆ ఖాళీబుడ్డి నెటో విసరివేశాడు. వెంటనే జాన్ తనకోటు జేబులోనుంచొక బ్రాందీ సీసాతీసి అందించాడు. రుచిమరిగినగున్నడు తక్షణం దాన్ని అందుకొని గుటకాయస్వాహా చేసివేశాడు. అంతేకాదు, ఆ సీసాని ఎత్తి బలంగా జాన్ ముఖం బ్రద్దలయ్యేట్లు మోదాడు. ఏదో ఆవిధంగా క్రొత్త రకం మత్తు కలవాటు చేసి, ఆ తర్వాత ఏడ్పించి వశపర్చుకోవాలని ఆశించినవాళ్లు అలాజరుగుతుందని కలలోనైనా తలవలేదు. తగిలినదెబ్బకు తాళలేక జాన్ "బాబో" అని గావుకేకలుపెట్టూ పడిపోయాడు. ఆ కేకలకీ, బ్రాందీ కలిగిస్తున్న కైపుకీ మతి చలించి గున్నడు కాలిబంధనాన్ని త్రెంచుకొన్నాడు. మైకేల్ కేకలకీ, గున్నడి భీకర ఘీంకారానికీ సర్కస్‌చూచే ప్రజలు అలజడి చెంది బయటకొచ్చేశారు. చిట్టిబాబు కంగారుగా బయటకొచ్చి చూచేసరికి— గున్నడు మహారోషంతో మైకేల్‌ని తన తొండంతో పైకి ఎత్తి పట్టుకొని ఉన్నాడు. ప్రజలంతా వింత చూస్తూ భీతితో నలిగిపోతూ నిలచిపోయారేగాని, ఏ ఒక్కరు కూడా జరుగుతున్న ఘోరాన్ని అడ్డుకొనే సాహసం చూపలేదు. కాని, చిట్టిబాబుమాత్రం మెరుపులా ముందుకుపోయి "ఆ గు - ఆ గు" అంటూ గున్నడిపైకి దుమికి ఎత్తిన తొండాన్ని ఎత్తినట్లే పట్టేసుకొన్నాడు. అంతసాహసం చిట్టిబాబుమాత్రమే తనపట్ల చూపుతాడన్న సంగతి మరువనిగున్నడు మరుక్షణంలోనే తగ్గిపోయాడు. దాపు తప్పి కన్ను పొట్టపోయిన జాన్ నక్కలనోట్లో మన్నుకొట్టిన మైకేల్ కలసి "గున్నడికి పిచ్చెక్కినట్లుంది - కనుకనే ఇలా ప్రమాదాలు చేస్తున్నది" అని ప్రచారం మొదలెట్టారు. ఆ విషయం నమ్మాలో లేదో ప్రజలు నిర్ణయించుకొనేలోగానే పోలీసులు వచ్చేశారు! గున్నడికింకా పూర్తిగా స్పృహ రానికారణంచేత ఇంకా భీకరంగానే కన్పిస్తున్నాడు. వాడిని అరెస్టు చేశామంటూ పోలీసులు అతిప్రయాసమీద గున్నడిని బంధించి లాక్కుపోయారు!...

ఆ సర్కస్‌వాళ్లే ఏదో మోసం

చేశారేగాని గున్నడు స్వతహాగా మంచివాడు - వాడికి పిచ్చెక్కలేదు అని ఎంతగానో చిట్టిబాబు మొత్తుకొన్నా వినేనాథు డెవరు? గున్నడు జంతువు! పైగా పిచ్చెక్కిందని అనుమానం!! కనుక జామీనుకూడా ఇవ్వడానికి ఎంత ప్రయత్నించినా అధికారులు సమ్మతించక పోలీసు స్టేషన్ ఆవరణలోనున్న వృద్ధమహావృక్షానికి గున్నడిని బంధించి వేశారు. దానికో సిపాయి తుపాకీతో కావలా!...మత్తు వదిలి చిత్రచూపులు చూస్తూన్న గున్నడు చూపరుల కెంతో జాలి కల్గించాడు.

ఇక చిట్టిబాబు దుఃఖానికి అంతే లేదు. కాని, వెంకట్రామయ్యగారు మాత్రం ధైర్యంగానే వున్నారు. "ఇదంతా ఆ మైకేల్‌గాడి కుట్ర! గున్నడికేమీ ఫర్వాలేదు. ఎంత డబ్బైనాసరే ఖర్చుచేసి నేనొదిలించి తీసుకువస్తాగా!" అనసాగారు.

ఊరిలో మాత్రం ఒకటే పుకార్లు! ఇటువంటి జంతువుల్ని ఇక వదిలి పెట్టరనీ, పూర్వం ఏలూరు మోతే వారి ఏనుగు ఒకటి ఇలా పిచ్చి పిచ్చిగా వ్యవహరించేసరికి చంపించి వేశారనీ, గున్నడి నేమిచేస్తారోగాని వదలడంమాత్రం జరుగదని - ఇలా రకరకాలు! ఇవన్నీ చూస్తూ చిట్టిబాబుకి మతిపోయింది! చదువు సంధ్యల్లేవు - నిద్రాహారాల్లేవు! ఒకటే ధ్యాస - ఎలా గున్నడిని వదిలించాలి! ఒకటే బెంగ-గున్నడిని చంపేస్తారేమో!...చిట్టిబాబూ, అతని మిత్రబృందమూ - తమప్రాణాలనైనా తెగించి గున్నడిని కాపాడాలని నిశ్చయించుకొన్నారు. వాళ్లు బోలెడు సినిమాలు చూశారు; ఎన్నో పుస్తకాలు చదివారు; ఎంతో సాహసం - బుద్ధిబలం వాళ్లకి వుంది! ఇక ఆలోచనలకూ, తెగింపుకీ లోటేమిటి?...ఇక చిట్టిబాబు టార్జానై పోదామనుకొన్నాడు. గున్నడిని విడిపించుకొని వాడితో కలసి పారిపోయి మహారణ్యాలలో, హాయిగా బ్రతకాలనుకొన్నాడు. మిత్రులూ వెంటనే కాకపోయినా తర్వాతనైనా ఒకడితర్వాత ఒకడు మెల్లగా చిట్టిబాబుని ఆ అరణ్యాలలో కలుసుకొని అక్కడే ఉండిపోవడానికి రాజీ అయ్యారు... ముందుగా గున్నడిని తప్పించాలి!..

...ఆనాటిరాత్రే చిట్టిబాబు కుర్రాళ్లతో కలసి పోలీసుస్టేషన్‌కి దొంగచాటున దారితీశాడు. గున్నడికి ఘారా ఇచ్చేవాడి గురక విన్పిస్తున్నది—ఏమూలనుండో! గున్నడు మాత్రం నిలచి చెవులు రిక్కించి, తనకు బాగా అలవాటైన అడుగుల సవ్వడి వింటున్నాడు. అంతలోనే చిట్టి వచ్చాడు. "పండుకోరా—అల్లరి చేయక పండుకో" అని మెల్లగా చెవిలో చెప్పాడు. మహానందంతో ఒళ్లు విరుచుకొని గట్టిగా ఘీంకరించాలనుకొన్నా, ఆపద తెలిసినవాడిలా మౌనంగానే మోకరిల్లాడు. చటుక్కున గున్నడి నెక్కాడు చిట్టిబాబు. ఈ లోగానే మిగతా కుర్రాళ్లు అతి నైపుణ్యంతో గున్నడికి బంధనాలనుండి విముక్తి కల్గించేశారు. "అదిగో ఆవంకకి—నీశక్తికొద్దీ పరుగెత్తు" అని హెచ్చరించాడో లేదో వేగంగా ముందుకి నడిచాడు గున్నడు. పోలీసుస్టేషన్ దాటగానే దౌడు లంకించుకొన్నాడు. ఒకటే దౌడు—ఎటో ఆయిద్దరిలో ఎవరికీ తెలియదు! "ఎక్కడా — ఎందుకూ ఆగవద్దు సుమా! ఆగితే మనల్ని చంపేస్తారోయ్! ఊఁ పరుగెత్తు—నీశక్తి కొద్దీ-ఊఁ!" అని మరోసారి హెచ్చరించాడు చిట్టి. అలా ... మైళ్లకు మైళ్లు, గంటలతరబడి ప్రాణాలను అరచేత బట్టుకొని ప్రయాణం చేశారు!...తూరుపు తెలతెలవారే సరికి—ఒక ఊరి పొలిమేర చేరారు. అకస్మాత్తుగా వారికెదురుగా ఆకాశాన్నంటుతూ అగ్నిజ్వాల లగుపించాయ్! హఠాత్తుగా గున్న డాగిపోయాడు. చిట్టిబాబు గుండెలదిరిపోయాయి. క్షణంలోనే తేరుకొని గున్నడిపై నిలబడి పరకాయించి ఆమంటలను పరీక్షించాడు.

చేరువలోనే అనాథశిశు శరణాలయం ఒకటుంది! దానికే నిప్పంటుకొని అది పరశురామప్రీతి అవుతుంటే — అందులోని వారంతా ఏదిక్కూ తోచక హాహాకారాలూ, ఆర్తనాదాలు చేస్తూ అటూఇటూ పరుగులెత్తుతున్నారు! మరుక్షణంలోనే చిట్టిబాబు గున్నడితో కలిసి అక్కడికి చేరుకొన్నాడు...ఊరిలోని ప్రజలుగాని, ఫైరింజన్లుగాని సహాయానికి వచ్చేలోగానే శరణాలయం సర్వనాశనమయ్యే అనుమానం కలిగింది. శరణాలయంలోని అనాథబాలల ఆక్రందనాలకూ, ఆ శరణాలయ నిర్వాహకుల ఆందోళనకూ అంతు లేకపోయింది. అందరూ పిచ్చెక్కినవారిలా గగ్గోలుపడటంమినహా రక్షణ కర్తవ్యమేమిటో ఎవరికీ తోచినట్లగుపించలేదు. ఆ శరణాలయాధ్య



## గున్నడి ఘనకార్యాలు



కారులబాధ చిట్టిబాబు కావేదన వెంటనే ఇద్దరూ కలిసి దగ్గ నీళ్లు మోసుకొస్తుంటే - గున్నడు
కల్గిస్తే, ఆ అనాథ శిశువుల ఆర్త ర్లోనేవున్న చెరువుకి పరుగులెత్తారు. సమయస్ఫూర్తిగా తన తొండంతో
నాదాలు గున్నడికి జాలికల్గించాయ్! చిట్టిబాబు చేతికందిన బకెట్టుతో నీరు పీల్చుకొచ్చాడు. గబగబా

శరణాలయాన్ని చేరి చిట్టిబాబు మంటలను ఒక వైపునుండి చల్లారుస్తుంటే, మరోమూల గున్నడు తొండంతో నీళ్లను ఎగజిమ్మి ఫైర్ ఇంజన్‌లాగానే అగ్నిని అణచసాగాడు. అది చూచినవారంతా విస్మయచకితులై పోయారు. ఆపత్తులో అద్భుతమైన అగ్నిమాపక యంత్రమేదో వచ్చి వారి నాదుకొంటున్నట్లనిపించింది. చిట్టిబాబు సైతం - గున్నడుతా నింతకాలం నేర్పినట్టి నూతనవిద్య నొకదానిని ప్రజల రక్షణార్థమై ప్రదర్శించడం చూచి ముగ్ధుడైపోయాడు! అంతే - అక్కడ చేరిన ప్రతి ఒక్కరూ చేతికందిన పాత్రనల్లా అందిపుచ్చుకొని చెరువులకీ, నూతులకీ పరుగులెత్తారు! వారంతా ఆవిధంగా అమితమైన ధైర్యసాహసాలతో అగ్నితో పోరాటం సాగిస్తుండగా - అప్పుడు ఫైర్ ఇంజన్లు వేగంగా వచ్చాయి...

ఈసందట్లో శరణాలయం లోపలి భాగాన్న మంటల్లో చిక్కుపడి బయటపడలేక చావుబ్రతుకుల్లో కేకలుపెట్టా ఏడుస్తున్న కొంతమందిపిల్లలగోడు ఎవరూ గుర్తించలేకపోయారు! కాని, గున్నడు వారిగోల పసిగట్టాడు. ఎవరన్నా ఏమన్నా చేస్తారేమో చెప్తారేమోనని కొంతసేపు కనిపెట్టాడు. కాని, ఎవరిగొడవలో వారుండిపోయారు. ఇక ఉండబట్టలేక ఆ పిల్లలున్న చోటుకి నడిచాడు. అటు మంట - ఇటు మంట- ఎటు చూచినా అగ్నిజ్వాలలే! మధ్య చిన్న గదిలో ఆ పిల్లలు చిక్కుపడిపోయి కాకిగోల చేస్తున్నారు - పాపం! అయినా, ఆ మంటల్లోకి సాహసంతో జొరబడిపోయాడు గున్నడు. ఆగదిలోనికి వాడి శరీరం పోలేకపోయింది. గది గుమ్మంలోనే - మంటలు తన శరీరాన్ని దహిస్తున్నా లక్ష్యపెట్టకుండానే - నిలబడి, తొండంతో ఒక్కొక్క శిశువునీ బయటకు అతి సున్నితంగా చేరవేశాడు! ... ఒక భయంకరమైన జంతువు తమని తన తొండంతో ఎత్తుతుంటే - గోరుచుట్టుపై రోకలిపోటు తగిలినట్లు గోలకెత్తారా పిల్లలంతాను!... ఆగోలకి ప్రజలంతా అప్పుడా ప్రదేశాన్ని చేరుకొన్నారు. ఒక ఏనుగు మానవ బాలురను తన తొండంతో నిప్పులోనుండి నింగికెత్తి అతిపదిలంగా నేలకు దించి రక్షించడం చూచి సంభ్రమాశ్చర్యాలతో కేరింతలు కొట్టారు!...

అంతలోనే అక్కడికి రిజర్వుపోలీసులదళం ఒకటి వచ్చింది. చిట్టిబాబునీ, గున్నడినీ అరెస్టు చేయడానికై వచ్చామని పోలీసు అధికారి ఒకడు చెప్పగా అక్కడ చేరిన ప్రజలంతా తెల్లబోయారు! నిముషాల మీద అందరకూ జరిగినకథ తెలిసిపోయింది. కాని, ఏ ఒక్కరుకూడా గున్నడొక పిచ్చిఏనుగనిగాని దుష్టుడనిగాని నమ్మలేకపోయారు! తమ కళ్లముందు ఆ గున్నడియొక్క సేవ, సాహసాలు తెలివితేటలు చూచివున్నారు కనుక, 'వీల్లేదు, గున్నడినిగాని, చిట్టిబాబునిగాని అరెస్టు చెయ్యనివ్వం!' అని ప్రజలంతా సత్యాగ్రహం చేశారు. చివరకి ఫైర్ ఆఫీసర్ కూడా గున్నడిసేవ,బుద్ధిఘనమైనవని ఎంతో మెచ్చుకొన్నాడు! అనాధశిశు శరణాలయాధికారులే కాకుండ, ఆ అనాధశిశువులు

> తల్లి: అబ్బాయి! యేపనినీ రేపు చేద్దామనక నేడేచేయాలి. యీ విధంగా ప్రవర్తిస్తూండు.
>
> అబ్బాయి: అలాగే నమ్మా! పెట్టిలో రేపటికని దాచిన లడ్డులు బయటికి తీసియిప్పు. నేడే తినివేస్తాను!
>
> * * *
>
> తండ్రి: అరే అబ్బాయి; మీ తరగతిలో అందరికంటే సోమరి ఎవరురా?
>
> కొడుకు: సోమరి అంటే ఎవరు?
>
> తండ్రి: అందరు వ్రాసుకొంటూ, లేక చదువుకొంటూ ఉంటే ఏమీ పని చేయక కూర్చొనేవాడు.
>
> కొడుకు: ఆయన మా మాష్టారు. మా తరగతిలో అందరికంటే సోమరిపోతు మా మాష్టారే!
>
> —— [illegible]

సైతం గున్నడిని ఎంతో మంచిగా, గొప్పగా కొనియాడేరు! పోలీసువారికేమీ పాలుపోలేదు......ఎదుటనే కాలిన శరీరంతో, ఓ గర్వంతో జాలిగాచూస్తూ నిలచిన గున్నడు; ఏడుస్తున్న చిట్టిబాబు ప్రేక్షకుల మనసులు కరిగించేశారు!

ఏమైనా చట్టప్రకారం గున్నడినీ, చిట్టిబాబునీ అరెస్టుచేసి ఆ పోలీసువారు తీసుకుపోయారు! కాని, "గున్నడికి స్వేచ్ఛ కల్గించి, ఆ సర్కస్ పెద్దలకి తగినశాస్తి చేయించి తీరుతా"మని ఆ ప్రజలూ బయల్దేరారు! గున్నడిమీద కేసు

(48-వ పేజీ చూడండి)



## జరిగినకథ

[మా నాన్నగారు—మున్యూ బిసెట్టీ—లాన్గ్యుడాక్‌లో పెద్ద సిల్కు వ్యాపారి. సొంత ఫ్యాక్టరీ అవీ వుండేవి. నేను (చిన్నా) పుట్టినరోజు లగాయతూ మా కుటుంబాన్ని ఏదో ఒక ఆపద చుట్టు ముట్టేస్తూనే వుంది. చివరికి దేశంలో వచ్చిన విప్లవం మూలంగా మా నాన్నగారిస్థితి పూర్తిగా చితికి పోయింది. కొంతకాలానికి మా నాన్నగారు దివాలా తీసి మా ఫ్యాక్టరీని అమ్మేశారు. మేము మా స్వస్థలం విడిచిపెట్టి లయన్స్ పటణానికి వెళ్ళిపోవలసి వచ్చింది. ఆ తరువాత కొంతకాలానికే మానాన్నగారు వ్యాపారంలో మళ్లా దెబ్బతిన్నారు. మా సంసారం రెండోసారి చితికి పోయింది. ఉన్న నలుగురం విడిపోవలసి వచ్చింది. మా అమ్మని పుట్టింటికి పంపేశాం. జాక్ నిలయ్మన్స్‌లోనే ఒకకొట్లో గుమాస్తాగా చేర్చారు మానాన్న. తను సారా వుత్పత్తిదార్ల సంఘంతరఫున ఒక వుద్యోగంసంపాదించుకొన్నారు. నన్ను తనదగ్గరకు పంపితే దాక్షిణాత్య విశ్వవిద్యాలయంలో 'అషర్' వుద్యోగం యిప్పిస్తానని మానాన్నగారి స్నేహితుడైన 'రెక్టర్' జాబు రాశాడు. తక్షణం బయలుదేరి ఆవూరు వెళ్లాను. ఆయన సిఫార్సు మూలంగా సర్లాన్డీ కాలేజీలో 'అషర్' గాచేరాను. జూనియర్ తరగతికి చెందిన పదకొండేళ్లలోపు పిల్లలు నాఅజమాయిషీకిందఉండేవాళ్లు.

'అషర్' వుద్యోగం చేస్తుండగా నాకు ఆనందించేందుకు ఎన్ని అంశాలైతే వున్నాయో, అన్నిటికీ మించి అఘోరించేందుకూ ఒక ప్రత్యేకఅంశం వుంది. నాకు, వారానికి రెండుసార్లు – అంటే గురు, ఆది వారాల్లో – విద్యార్థులను వెంటబెట్టుకొని షికారుకి తీసుకుపోవలసిన డ్యూటీ పడేది. ఆ క్రూరవెధవల్ని షికారుకి తీసుకుపోవటమంత యిబ్బందికరమైన విషయం మరొకాటి లేదు.

పట్టణానికి అరమైలుదూరంలో కొండల్ని ఆనుకొని, ఒక పెద్ద మైదానం వుండేది. పచ్చలు పొదిగిన రత్నకంబళం పరచినట్లు శ్వేతవర్ణంగా వుండేది. మైదానాన్ని ఆనుకొని సెలయేరు ఒకటి జలజలా పారుతుండేది. అక్కడే దగ్గరల్లో మూడు నాలుగు హోటల్లుకూడా వుండేవి. అదీ; – పిల్లల్ని షికారుకి తీసుకుపోయే చోటు. స్కూలునుంచి బయలుదేరే టప్పుడుమాత్రం వ్రగూపుకాగ్రూపుగా, గ్రూపుకొక మాస్టరుచొప్పున మూడుజట్లూ బయలుదేరేవి. కాని— మైదానంచేరాకమాత్రం, మిగిలిన యిద్దరుమాస్టర్లూ తమ తాలూకు పిల్లల్నికూడా నన్నే మందవెయ్యమని చెప్పి, తాము సీనియర్ విద్యార్థుల ఆహ్వానాలను అందుకొని దగ్గర్లోవున్న హోటల్లకి పోయి కడుపులు పగిలేటంతవరకు తాగుతూ కూర్చునేవాళ్లు. ఇక్కడ ఆ పిల్లలతో నేనుపడే చీదర అంతా ఇంతా కాదు!

అసలు అటువంటి చక్కనిచోట ఏ బాదర బందీ లేకుండా హాయిగా పచ్చగడ్డిమీద పడుకొని సెలయేటి సంగీతం వింటూ, నవవికసిత కుసుమపరిమళాన్ని మనసార, తనివితీర ఆఘ్రాణిస్తూ మైమరచి పోవాలిగాని, చీటికిమాటికి చిలిపి కయ్యాలాడే యిలాంటి కోతిసజ్జును కనిపెట్టుకు కూర్చోవటం ఎవడి తరం! అందులోనూ – ఒక క్లాసు పిల్లలుకూడా కాదు; మొత్తం స్కూలులోని విద్యార్థులు ఎంతమందైతే

అనువాదం: విశ్వాత్ముల నరసింహమూర్తి

వున్నారో అంతమందినీ అజమాయిషీ చేస్తూ కూర్చోవాలి.

నా కష్టం అంతటితో తీరిపోయేది కాదు. నా పాలబడ్డ జూనియర్ క్లాసు కూనా గురుసునీ వెంట వేసుకు వీధులవెంట వూరేగటం మరీకష్టంగా వుండేది. మిగిలిన గ్రూపుల పిల్లలు కొంచెం పెద్దవాళ్లూ, బుద్ధి ఎరిగినవాళ్లూ అవటంచేత, తర్ఫీదు పొందిన సైనికుల్లా చక్కగా లైను తప్పకుండా టకటకా నడిచేసేవాళ్లు. ఈ పసివెధవలు అల్లాక్కాదు. గొంతుచించుకుపోయేలా ఎంత అరిచినా, వాళ్లకి లైను తప్పకుండా నడవటం అంటే ఏమిటోకూడా బోధపడేది కాదు. నా లైను ఎప్పుడుచూసినా అష్టవంకరలు తిరిగిపోయి వుండేది.

లైను చివరిభాగం మరీ గగ్గోలుగా వుండేది. అక్కడికీ నేను జాగ్రత్తపడి లైను మొదట్లో కాస్త యింగితంవున్న పెద్దపిల్లల్ని నిలబెట్టేవాణ్ణి. వాళ్లు మాత్రం లైనుతప్పకుండా నడిచేవాళ్లు. చివరికి పోయినకొద్దీ వచ్చేది తంటా. చింపిరిజుట్లూ, మట్టిచేతులు, మాసిపోయిన బట్టలూ, – వీటితో విరాజిల్లే బాలకాధములు కొందరు వుండేవాళ్లు. వీళ్లే లైను చివరిభాగాన శోభిల్లే నాశిష్యగణం. వాళ్లవంక చూడటానిక్కూడా నాకు మనసొప్పేది కాదు.

అంత అందమైన అనుచరవర్గంతో 'సర్లాన్‌డీ' వీధుల్లో నలుగురికంటా పడటంఅంటే నా కేమిటో తలకొట్టేసినట్లుండేది. అందులోనూ బోర్డింగ్ స్కూలు యిలాకా ఆడపిల్లలూ, ఊళ్లోవున్న యితరత్రా అందకత్తెలూ మంచి మంచి దుస్తులు వేసుకొని చర్చిలో ప్రార్థనలకని బయలుదేరే ఆదివారాల్లో, యిలాంటి దుస్థితిలో వాళ్లకంటబడటం నాకు నిజంగా చాలా నామోషీగా వుండేది. నాకు చూడబోతే, మాటవరసకైనా మంచి బట్టలంటూ వుండేవికావు; పైగా, నా వెనక యీ సజ్జు!

ఈ సజ్జు అంతట్లోకీ చిద్విలాసమైన చిన్నవాడొకడు వుండేవాడు. వాడూ వాడి వికారరూపమూ, తలుచుకొన్నప్పుడల్లా నాకు కడుపులో చెయ్యిపెట్టి తిప్పినట్లుగా వుండేది.

వాడి రూపురేఖ విలాసాలు వర్ణించటం నా తరంకాదు: అయినా ఒకలా చెప్పవచ్చు. దొడ్డికాళ్లు కలిగివుండి, అస్తమానం మురుగుకాల్వల మీదనుంచి వచ్చే సుగంధంలాంటి వాసనలను తన చుట్టూ వెదజల్లే చిన్నసైజు కోతిపిల్ల నొకదాన్ని మీరు మనస్సుల్లో వూహించుకోండి. నే చెప్పవచ్చిన చిన్నవాడికి ఆ లక్షణాలు అన్నీ సరిపోతాయి. అసలు వాణ్ణి చూడగానే వీడు మానవజాతి తాలూకు సంతతి అని ఒప్పుకోవటం ఓ పట్టాన కుదరని విషయం. ఇలాంటి భగవత్సృష్టివిశేషం ప్రపంచం మొత్తంమీద ఏ స్కూలులోనూ చూడలేమంటే, అందులో అతిశయోక్తి ఏమీ లేదు. అలాంటివాడొకడు విద్యార్థిగా వున్నాడంటేనే, ఆ విద్యాసంస్థకు ఎంతో అవమానం.

వాడంటే నాకు అంత పరమ అసహ్యం. లైను చిట్టచివరని అల్లంతదూరాన అసహ్యంగా బాతునడకలు నడిచే యీ వెధవని పట్టుకు నాలుగు తన్ని తగిలేద్దామా అనిపించేది.

'బంబన్'—అది వాడికి స్కూలుపిల్లలంతా కలిసి పెట్టిన ముద్దుపేరు—లేని సంసారంలో పుట్టాడు. ఆ విషయం వాడి ఆకారంలోనూ, హావభావ చేష్టల్లోనూ, వాడి చుట్టూ ముసిరే మిత్రగణంలోనూ బాగా వ్యక్తమయ్యేది.

ఆమాటకొస్తే—'సర్లాన్‌డీ' మహానగరంలో గల సకలమైనటువంటి వీధి వెధవలూ వీడి ప్రాణస్నేహితులు.

మా క్లాసు కుర్రాళ్లు ఏనాడు షికారుకి బయలుదేరినా, యీ 'బంబన్' చలవమూలంగా, మట్టికొట్టుకుపోయిన గోట్టికాయ వెధవలు ఎందరో పెద్ద వూరేగింపులా మా వెనక పడేవాళ్లు. దారిపొడుగునా వీళ్లు 'బంబన్'ని సహస్రనామాలతో సంబోధిస్తుండే వాళ్లు: వీధుల్లో లభ్యమైన జీడిపిక్కలూ అరటితొక్కలతో యధాశక్తి వాణ్ణి ఆపాదమస్తకం పూజించేవాళ్లు. ఈ మర్కటచేష్టలన్నీ చూసి నా క్లాసు పిల్లలు తెగమురిసిపోతుండేవాళ్లు. నాకుమాత్రం 'బంబన్'మీద వొళ్లు మండిపోతుండేది. వారానికొకసారైనా, వీడి వునికి మూలంగా నా క్లాసు పిల్లలలో క్రమశిక్షణ ఎంతగా కుంటుపడుతున్నదీ సుదీర్ఘంగా వివరిస్తూ ప్రిన్సిపాల్‌గారికి రిపోర్టు రాసేవాణ్ణి.

నేను రాసిన రిపోర్టులన్నీ ఏమైనాయో ఏమో కాని, నాకుమాత్రం వారానికి రెండుసార్లు మష్యూ



# అన్నా-చిన్నా



'బంబన్' గారితోపాటు వీధుల్లో వూరేగే గతి తప్ప లేదు. తప్పకపోగా, 'బంబన్'గారు నామీద కసిపట్టి నట్లు అంతకంతకూ మరింత మురికిగా తయారౌతు న్నారు: వారికాళ్లు యింకా యింకా దొడ్డి తిరిగి పోతున్నాయి.

కాలం అదేతీరున గడిచిపోయినా బాగుండేది. అలాకాకుండా - ఒకానొక ఆదివారంనాడు బంబన్ బహుచక్కని అలంకరణతో మాముందు ప్రత్యక్షమైనాడు. ఆ ఆకారంచూసి మేమంతా కొయ్యబారి పోయాము.

అలాంటిదృశ్యం మీకు పీడకలల్లోకూడా కని పించదు. వాడిచేతులూ కాళ్లూ నల్లగా కప్పేసి వున్నాయి. ఏదైనా మురుగుగుంటలోపడి కాస్సేపు దొర్లి వచ్చాడేమో - నఖశిఖపర్యంతం ఒకటేబురద. ఆ బురద అడుగున బొందులాగు అయినా వుందో లేదో, - వెధవకి! పిల్లదయ్యంలా వున్నాడు.

అన్నిటికంటె విషాదకరమైన విషయం ఏమి టంటే, ఏనాడూ లేనిది ఆరోజున వాణ్ణి స్కూలుకు పంపేముందు ఎవరో అతిశ్రద్ధగా వాణ్ణి అలంకరించి పంపారు. బొట్టుబొట్టుగా కారుతున్న బురద అడుగు నుంచి తలకురాసిన వాసిలేన్ వాసన కొట్తోంది. నిండైన మనస్సుతో ఏ మాతృమూర్తో ఆనాడు వాడికి కేశసంస్కారంచేసి స్కూలుకి పంపివుంటుంది. ఎన్ని చేస్తేనేం? ఆ ఇంటికీ స్కూలుకీ, మధ్యను మురుగు కాల్వలు ఎన్నో వున్నాయిగా!

వాటిలో ఏ ఒక్కదానిమీదా పక్షపాతం చూప కుండా అన్నింట్లోనూ తలా కాస్సేపు పడి దొర్లి వచ్చాడు - యీ 'బంబన్.'

ఇంతచేసి, ఏమీ ఎరగనట్లు ఏమీ జరగనట్లు అదంతా తనికి సహజమే అయినట్లు, యథాప్రకారం లైనుచివరకివచ్చి నిల్చుంటున్నాడు. నాకు వొళ్లుమండి పోయింది:

"గెట్ ఔట్!" అని ఒక్క కేక పెట్టాను.

అంతకేకా తనసెదో హాస్యం చెయ్యటానికి ఎగ తాళిపట్టించటానికీ వేశాననుకొన్నాడు కాబోలు— నవ్వుతూ అలాగే నిలబడ్డాడు. పైగా తా నారోజు ఎన్నడూ లేనంత అందంగా వుండివుంటానని వాడికొక గట్టి నమ్మకం.

"ఫో, అవతలకి!" అని మళ్లీ అరిచాను.

రెండోసారి కేక విన్నాక వాడి మొఖంమీద నవ్వు మాయమైపోయింది. దాని స్థానంలో అతి దీన భావం ఒకటి పాదుకొన్నది. అయినా అప్పటికోపంలో వాణ్ణి అక్కడే వదిలేసి, మిగిలిన పిల్లలతో ముందుకు వెళ్ళిపోయాను. 'బంబన్' కదలలేని కొయ్యలా రోడ్డు మధ్యను నిలబడిచూస్తూ వుండిపోయాడు.

అంతటితో యిక ఆరోజుకి వాడిముఖం చూడ నక్కరలేకుండా పోతుందనుకొన్నాను కాని వూరి పొలిమేరలు దాటబోతుండగా పిల్లల బారులో ఆ కొనని కిచకిచలు గుసగుసలు వినిపించాయి. విషయ మేమిటోనని వెనక్కితిరిగి చూశాను - మా లైనుకి మూడుగజాల దూరంలో దొడ్డికాళ్లదొర 'బంబన్' తూలుతూ తూలుతూ వస్తున్నాడు.

లైను మొదట్లోవున్న పిల్లల్ని స్పీడు ఎక్కించ మన్నాను. 'బంబన్'ని ఏడిపించటానికి ఏదో ఎత్తు వేస్తున్నానని పిల్లలు అర్థం చేసుకొన్నారు. మెయిల్ స్పీడుతో ముందుకు నడిచేశారు.

నడుస్తూ నడుస్తూ అందరమూ అప్పుడప్పుడు వెనక్కి తిరిగిచూసి, మమ్మల్ని అందుకోనూ లేక వడివడిగా నడవనూ లేక దొడ్డికాళ్లతో డేకొంటూ వస్తున్న 'బంబన్'ని చూసి ఫక్కున నవ్వాం.

వాడి మొండితనానికి అంతేమున్నది! - మేము మైదానంమీదికిచేరిన కొన్ని క్షణాలలోనే తనూ వచ్చేశాడు. ఆ రావటంలో వాడెంత హైరాను పడ్డాడోగాని, ముఖం పూర్తిగా వాడిపోయింది; కాళ్లల్లో కుంటుకూడా వచ్చింది.

ఆ స్థితిలో వాణ్ణి చూసేసరికి నాకు విపరీతమైన జాలేసింది. గడచిన క్షణంవరకూ వాడిపట్ల అంత నిర్దాక్షిణ్యంగా వున్నందుకు నన్ను నేనే అసహ్యించుకొన్నాను. దగ్గరకు రమ్మని ఆప్యాయంగా పిలిచాను.

బిక్కముఖంతో దగ్గిరకు వచ్చాడు. వాడివంక అప్పుడు పరిశీలనగా చూశాను. వాడి వొంటిమీద వున్నది బీదపిల్లలు తొడుక్కునే ఫ్లాక్! అందు

లోనూ - ఎర్రచారగల బ్లౌజ్!! కొన్ని సంవత్సరాలక్రితం లయన్స్ మహానగరంలో యీ డింభకాధముడు స్కూలుకిపోయిన మొట్టమొదటరోజున తొడుక్కొన్న బ్లౌజ్ మాదిరి బ్లౌజ్!!

ఆ బ్లౌజు చూడగానే గుర్తుపట్టాను. నా మనస్సు ద్రవించిపోయింది. పైకి కనిపించని కన్నీళ్ళు ఎన్ని కార్చానో! "నువ్వా, యీ అమాయకుణ్ణి హింసించ సాహసిస్తున్నావ్?" అని నా అంతరాత్మ నన్ను హెచ్చరించింది. ఆ క్షణంనుంచి నాకా కుర్రవాడి మీద జాలీ, ప్రేమ అంకురించాయి.

పాపం - వాడికాళ్లు ఎంతగా పీకుతున్నాయో; నిలబడలేక నేలమీద కూలబడిపోయాడు! వాడితో పాటు నేనూ కూలబడ్డాను. ఆ కబురూ యీ కబురూ చెప్పాను: పండొకటి కొనిపెట్టాను. నిజంగా ఆ క్షణంలో వాడికాళ్ళు నొప్పులు పోయేవరకు పిసక మన్నా పిసకటానికి సిద్ధమైనాను.

ఆరోజునుంచీ 'బంబన్' నాకు చాలా కావలసిన మిత్రుడైనాడు. అతని జీవితాన్నిగురించిన దిగువ వివరాలు ఆ తరువాత నాకు తెలిశాయి.

వాళ్లనాయన గుర్రాలకి లాడాలు కొట్టే కుమ్మరి. కటికదరిద్రుడు. అయినప్పటికీ చదువువల్ల ఒనగూరే మేళ్ళనుగూర్చి వేనోళ్లవిని, తన కొడుకును చదివించాలనీ, చదివించి చాలా గొప్పవాణ్ణి చెయ్యాలనీ వువ్విళ్ళూరాడు. ఆ ఆశకొద్దీ కుర్రవాణ్ణి స్కూలుకి పంపించాడు. కాని వీడికిమాత్రం ఎంతకీ చదువు రాలేదు.

వాడు స్కూలుకి వచ్చిన మొట్టమొదటిరోజున మాస్టారు వాడిచేతికి ఒక కర్రపుల్లయిచ్చి, దాన్ని చూసి బొమ్మ వెయ్యమన్నాడట!

వాడు ఆరోజేకాదు, ఆ తరువాత ఒక్క సంవత్సరంపాటు, అదేపని చేశాడు. ఆ కర్రపుల్లల బొమ్మలు గీయటం తప్పించి యింకొకటి ఏమీ వాడికి చేతకాలేదు. అదైనా అష్టవంకరలతో గీసేవాడు.

స్కూలులో వాణ్ణిగురించి ఎవరూ ఏమీ పట్టించుకొనేవాళ్లు కాదు. వాడికి ఫలానా అంటూ ఒకక్లాసుకూడా లేదు. స్కూలుకి వచ్చీ రావటంతోనే ఏ క్లాసురూము తెరిచివుంటే, ఆ క్లాసులోకి పోయి కూర్చునేవాడు. నా డెస్కుదగ్గర కూర్చున్నా ఎవరూ ఏమీ అనేవాళ్లు కాదు. ఒకానొకసందర్భంలో యితడు వేదాంతంక్లాసులో కూర్చుని కర్రపుల్లల బొమ్మలు గీశాడట!

స్టడీహాల్‌లో వాణ్ణి నేననేకసార్లు చూశాను; - పెద్ద కాగితం ముందు పరుచుకొని దానిమీదికి పూర్తిగా వంగిపోయి, కలాన్ని రెండుచేతులతోనూ గునపంలా పట్టుకొని పళ్లు బిగబట్టి చెమటలు కక్కుకొంటూ కర్రపుల్ల గీస్తూవుండేవాడు. ఒకపుల్లలు గీయటం ఐపోగానే యింకోపుల్ల. ప్రతిసారీ కలాన్ని సిరాబుడ్డిలో ముంచేవాడు. కాగితంమీద గీస్తున్న గీత కొనవరకూ వచ్చాకగాని పళ్ళసందున బిగబట్టివుంచిన నాలికను నోట్లోకి నెట్టేవాడు కాదు. అప్పుడు చేతులు దులుపుకొంటూ కాసేపు విశ్రాంతి తీసుకొని మళ్ళీ అదే కార్యక్రమం ఆరంభించేవాడు.

ఇటీవల నాతో చనువు ఏర్పడినప్పటినుంచీ, 'బంబన్' మరీ పట్టుదలగా పనిచేస్తున్నాడు.

ఒక్కొక్క పేజీకి ఒక కర్రపుల్లచొప్పున గీసేసేవాడు. ఒకపేజీ పూర్తికాగానే నేను కూర్చునే బల్లమీదికి ఎగబాకి, తాను సృష్టించిన మహత్తర కళాఖండాన్ని నా బల్లమీదపెట్టి విజయగర్వంతో చిరునవ్వులు నవ్వుకొంటూ నిల్చునేవాడు.

"బాగుంది! చాలా బాగుంది!" అంటూ వాడి భుజం తట్టి పంపించేవాణ్ణి.

నిజానికి ఆ 'కళాఖండం' చాలా ఘోరంగా వుండేది; ఐనా వాడి మనస్సు నొప్పించటం నాకు చేతకాని పని.

ఆవిధంగా వాడికి తగిన ప్రుత్సాహంయిస్తూ వున్నందువల్ల కొంతకాలానికి వాడు గీసే గీతల్లో వంకరలు చాలామటుకు తగ్గిపోయాయి; కాగితాల మీద సిరా డాగులు పడటమూ తగ్గింది. మరి కొంత కాలం అలాగే గడిస్తే వాడిచేతకూడా ఏదైనా చదివించగలిగేవాణ్ణేమో — కాని విధి మమ్మల్ని వేరుచేసింది. ఇంటర్‌మీడియెట్ క్లాసు మాస్టారు వెళ్లిపోతున్నారు. అప్పటికి స్కూలు మూసేరోజులు దగ్గర పడుతున్నందువల్ల ప్రిన్సిపాల్, ఆయన స్థానంలో కొత్తమాస్టర్ని వెయ్యకుండా, నన్ను అక్కడికి



## గున్నడి ఘనకార్యాలు



(43-వ పేజీ తరువాయి)

నడిచింది. కాని, సర్కస్ మావటి వాడొకడు గున్నడి కనుకూలంగా సాక్ష్యమిచ్చేశాడు. వాడు - ప్రథమంగా జాన్ గున్నడిని చూడ్డం లగాయతూ మైకేలూ జానూ కలసి గున్నడిని సంపాదించుకోవాలని ప్రయత్నించడం, మైకేలు వెంకట్రామయ్యగారిని గున్నడినమ్మమని కోరి చీవాట్లు తినడం, ఆ ఉక్రోషం మీద జాన్, మైకేల్ ఇద్దరూ కలిసి ఆనాటిరాత్రి గున్నడికి బ్రాందీ త్రాగించడం - అంతా ఎరుగున్నవాడు! దానితో గున్నడి "పిచ్చి" రహస్యం బట్టబయలై పోయింది!... చివరికి తీర్పు చెప్పబడింది - " ఒక గొప్ప ప్రమాదాన్ని అరికట్టడంలో అమోఘమైన సహాయంచేసి, అనేక మంది అనాథశిశువులకు ప్రాణభిక్ష పెట్టి చరిత్రలో చెప్పుకోనతగిన అపూర్వ కృషి గావించినందుకు గాను, ఏదో మోసానికి గురై గున్నడు చేసిన చిన్న అల్లరిగురించి పెట్టబడిన కేసు కొట్టివేయడమే కాకుండా, ప్రభుత్వం వారు ప్రత్యేక బంగారు పతకాలు కూడా బహూకరించారు!... ఒక సాధు జంతువును, అన్యాయం చేయజూచినందుకు జాన్‌కీ, మైకేల్‌కీ జరిమానాలు విధించబడ్డాయి!......

ఊరినుండి సర్కస్‌వాళ్లు తమ డేరాలు ముడుచుకొని తరలిపోతుంటే — గున్నడూ, వాడిపై నుండి చిట్టిబాబూ, వారి చుట్టూ మిత్రబృందం సగర్వంగా, సంతోషంగా కేరింతలు కొడ్తూ నిలిచారు!......



పోలీసుస్టేషనుదగ్గరికి రొప్పుతూ పరుగెత్తుకువచ్చిన ఒక ఆయన తనను తొందరగా లాకప్ చేయమని కోరాడు. ఇన్‌స్పెక్టరు ఎందుకని అడిగాడు.

"నేను మా ఆవిణ్ణి ఈపచ్చడిబండతో కొట్టాను"

"అరె! ఆమె చచ్చిపోయిందేమొ" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ఆదుర్దాగా:

"లేదండీ! అదే వచ్చిన చిక్కు. అందుకనే నన్ను చప్పున లోపలపెట్టి తాళం వేయమంటున్నాను" అన్నాడు ఆయన అతిజాలిగా ముఖంపెట్టి.



## అన్నా - చిన్నా



పొమ్మన్నాడు. నా స్థానంలో గడ్డాలూ మీసాలూ కలిగిన ఒక కవిని వేశారు.

ఈ మార్పుకి నేను మానసికంగా చాలా కలవరపడ్డాను. అందుకు మొదటి కారణం - ఇంటర్ మీడియెట్ విద్యార్థులు. వాళ్లు, వాళ్ల అల్లరీ నా కిదివరకు మైదానంమీద అనుభవమే. అంత అల్లరి మూకతో అహర్నిశలూ గడపవలసివస్తున్నందుకు చాలా కంగారుపడ్డాను.

రెండో కారణం - ఈ పసివాళ్లను వదిలిపెట్టిపోవాలి. వీళ్లని యింతకాలమూ నా బిడ్డల్ని చూసుకొన్నట్లు చూసుకొన్నాను. నేను వెళ్లాక, ఆ గడ్డాల కవీశ్వరుడు వీళ్లని ఎంతగా భయపెట్టేస్తాడోననీ, 'బంబన్' గతి ఏమౌతుందోననీ దిగులుపడ్డాను.

నేను పై క్లాసులో చార్జి తీసుకోబోతున్న రోజున, జూనియర్ క్లాసుపిల్లలు చాలా కలవరపడ్డారు. మరీ, క్లాసు ఆఖరున గంట మోగేసరికి అందరి ముఖాలూ ఒక్కసారిగా వివర్ణమైనాయి. వాళ్లలో ప్రతిఒక్కరూ నా దగ్గరకు వచ్చి శెలవు తీసుకోవాలని తొందరపడ్డారు. కొందరైతే ప్రేమాభిమానాలు వుట్టిపడే వాక్యాలుకూడా పలికారు.

మరి 'బంబన్' సంగతి?

వాడేమీ మాట్లాడలేదు. కాని నేను క్లాసు రూము వదిలి వెళ్లిపోతున్నసమయంలో నా దగ్గరకు వచ్చి నిలబడ్డాడు. మనిషి సిగ్గుతో కుంచించుకుపోతున్నాడు. ఒక్కమాటయినా మాట్లాడకుండా నా చేతిలో ఒక కాపీపుస్తకం పెట్టాడు. పేజీలు తిప్పి చూశాను. ప్రతిపేజీలోనూ ఒక క్రపుల్లబొమ్మవుంది. ఇవన్నీ వాడు ప్రత్యేకం నాకోసమే ఎంతో కష్టపడి గీశాడు - పాపం!

(ఇంకా వుంది)

# పందెం పది రూ. లు.

"నిజంచెప్తే ఎవరూ నమ్మరురా" అన్నాడువాడు.

"పడిశావులే" అన్నాడువీడు.

"పందెం?"

"పదిరూపాయలు!"

"సరే బ్యాంకులో దొంగతనంచేసి నిజంచెప్తా. ఎవరేనా నమ్మితే జైలునించి వచ్చాక నీకు పదిరూపాయలిస్తా. ఎవరూ నమ్మకపోతే నువ్వు వెంటనే ఇవ్వాలి" అన్నాడు వాడు.

వాడు వీడూ బ్యాంకుకి వెళ్ళారు. వాడు జనం రద్దీలో దూరి ఐదువందలు దొంగతనం చేశాడు. ఎలాగని అడక్కండి. వీడుకూడా చూశాడు.

ఇద్దరూ మూడడుగులు వేశాక బ్యాంకు బంట్రోతు తారసిల్లాడు.

"ఏమోయ్! చిన్నమాట." అన్నాడు 'వాడు' గుడ్లు మిటకరించి.

బంట్రోతు ఆగాడు.

"కొంచెం డబ్బు అవసరం ఉండి ఐదు వందలు దొంగతనం చేశా. ఫరవాలేదుగా?"

బంట్రోతు ఎగాదిగా చూసి ఫక్కున నవ్వాడు. "అచ్ఛా, మరేం ఫరవాలేదు. పట్టికెళ్ళండి." అంటూ వెళ్ళిపోయాడు. వాడు వీడు పురోగమించారు - వాడు నవ్వుతూ, వీడు జంకుతూ.

హాలు గుమ్మంలో గూర్ఖా కూర్చున్నాడు తుపాకీ పక్కని.

'వాడు' పలకరించి చెప్పాడు. "క్యాభయ్యా! మైనే ఇధర్ థోడే రూప్యే చోరీకియా; క్యా కహతే హో?" అన్నాడు భాషలో.

గూర్ఖా కొంచెం అనుమానంగా చూశాడు.

వాడు కళ్ళు పెద్దవిచేసి నవ్వుతూ "హాఁ భయ్యా!" అన్నాడు.

గూర్ఖా సందేహం తీరిపోయింది.

హాలు అదిరేలా నవ్వాడు. "బహూత్ అచ్ఛా బాబుజీ; బహూత్ అచ్ఛా! లేజాయీయే ఫర్వానై" అన్నాడు.

వాడు వీడూ నడిచారు. మేడమెట్లు దిగుతూంటే మేనేజరెదురయ్యాడు.

ఈసారి 'వీడే' పిలిచాడు. "సార్ ఒక్కమాట. ఈయన మీ బ్యాంకునించి ఐదు వందలు దొంగతనం చేశాడండి" అన్నాడు.

'వాడు' వినయంతో చెప్పాడు నోట్లుచూపించి "ఇవిగో ఇవేనండి - కొంచెం అర్జెంటుపనిబడి, ఈపని చెయ్యక తప్పలేదు." అన్నాడు.

మానేజరు ఒక్కక్షణం సూటిగా చూచాడు. కొంచెం చిరునవ్వూ చాలా చిరాకూ ప్రకటించి, "నాకు చాలా అర్జెంటు పనుందండి. తీరిక లేదు" అంటూ వెళ్ళిపోయాడు.

వాడూ వీడూ మెట్లు దిగి ఆవరణ గేటు దాటారు.

"డబ్బుతే" అన్నాడు వాడు.

"ఇంకొక్క ఛాన్సు" అన్నాడు వీడు.

పోలీసుకారు ఆగింది. ఒక సర్కిల్ ఇనస్పెక్టరూ పోలీసు దిగి బ్యాంకులోకి వెళ్తున్నారు.

చివరప్రయత్నంగా వాళ్ళం పిలిచారు. వాడు చెప్పాడు.

"ఏమండి సార్. కొంచెని ఇబ్బందివచ్చి ఈ బ్యాంకులో - ఇప్పుడే - ఈ ఐదు వందలే - దొంగతనం - చేశానండి. బంట్రోతుకి చెప్పాను. 'ఫరవా లేదు పట్టికెళ్ళండ'న్నాడు. గూర్ఖాకిచెప్పాను 'బహూతచ్ఛా' అన్నాడు. మానేజరుగారేమో తీరికలేదన్నారు. అయ్యా! అదీ సంగతి."

సర్కిల్ పోలీసు వంక చూచాడు. పోలీసు సర్కిలు వంక చూచాడు. ఇద్దరూ వాడినీ, వీడనీ చూచారు.

వాడు అమాయికంగా కళ్ళు విప్పార్చి నవ్వాడు.

సర్కిల్ తొణకకుండా జవాబిచ్చాడు. "నాకూ తీరిక లేదండి. సారీ...ఏవోయ్ పోలీసువాడూ! నీకేమేనా తీరిక ఉంటే చూడూ" అన్నాడు.

పోలీసు అంతకన్నా తొణక్కుండా, వినయంతో చెప్పాడు.

"అయ్యా తమరికి తెలీందేముంది. నాకూ తీరిక లేదండి ... అదీగాక సంకెళ్ళు పట్టుకురాలేదండి"

"చూశారుగా? మరి మేం పోతాం పనుంది" అని ఫక్కున నవ్వుతూ సర్కిలు వెళ్ళిపోయాడు - పోలీసుసమేతుడై.

వీడు ఓడినవాడై, వాడికి పదిరూ॥లు ఇచ్చుకున్నాడు.

అమృతలాల్

విక్రమ్‌వారి "మాగోపి" లో మాస్టర్ వెంకటేశ్వర్, జమున.



సాహిణీవారి "అమరసందేశం"లో అమరనాథ్, పద్మిని.





యునైటెడ్ టెక్నీషియన్స్‌వారి "పల్లెపడుచు" లో ముక్కామల, సీతారాం, పేకేటి, చలం.

ఈమధ్య ఇద్దరు ఇటాలియన్ సినిమా వ్యక్తులు మద్రాసు వచ్చారు. వీరిలో అల్ఫ్రెడో మెన్జోరీ అనే ఆయన డైరెక్టరు. ఈయన రోజెలినీదగ్గిర చాల కాలం పనిచేసి అనుభవం సంపాదించాడు. ప్రస్తుతం ఈయన ఇక్కడ ఒక చిత్రం తీయబోతున్నాడు. ఈయన వెంట అంటోనియో పురీనో అనే స్క్రిప్టు రచయిత కూడా వచ్చాడు.

వీరిని ఇటాలియన్ చిత్రసీమనుగూర్చి అడిగాను. ఇటలీలో ఏటా 100 పైగా చిత్రాలు తయారవుతున్నాయి. వీటిలో చరిత్రాత్మక చిత్రాలు, సంగీత చిత్రాలు, హాస్యచిత్రాలు, వాస్తవిక చిత్రాలు మొదలైన చాలా రకాల చిత్రాలుంటాయి.

"వాస్తవిక చిత్రాలు ఏమాత్రం తయారవుతాయి?"

"20, 30 మధ్య ఉంటాయి."

"హత్యలు, దొంగతనాలు మొదలైన నేరాల చిత్రాలుకూడా తయారవుతాయా?"

"ఆ. కొద్దిగా తయారవుతూనే ఉన్నాయి. అయితే అవి హాలీవుడ్ చిత్రాల సమానాలో ఉండవు. ఈ నేరచిత్రాల్లో సాధారణంగా జరిగిన సంఘటనలను జ్ఞప్తికి తెచ్చే ఇతివృత్తాలే ఉంటాయి. కాని మావాళ్లు నేరాన్ని 'గ్లామరైజ్' చెయ్యడానికి ప్రయత్నించరు."

ఇటాలియన్ వాస్తవికచిత్రాలు ఇతర దేశాల్లో బాగా విజయం సంపాదిస్తున్నా, ఇటలీలో అవి నష్టం పొందుతున్నాయనీ నేను చాలాసార్లు కొన్ని పత్రికల్లో చదివాను. దీనికి చెప్పబడే కారణం ఇది: సామాన్య ప్రజలు దైనికజీవితంలో కష్టాలు అనుభవిస్తూనే ఉన్నారు. రోజంతా ఎక్కడో కష్టపడి పనిచేసివచ్చి, కులాసాగా సినిమా చూద్దామనిపోతే, అక్కడ కూడా కష్టాలకథలే చూపదలిస్తే ఎవరూ భరించలేరు. అందుచేత వారు అవాస్తవిక చిత్రాలనే ఎక్కువ చూడగోరుతారు. ఈ వాదన నిజమని నా కెప్పుడూ అనిపించలేదు. ప్రపంచంలో ఉండే కష్టాలూ, బాధలూ అన్నీ మూటకట్టి ఒక హీరో మీద పడవేసి చూపించడమే వాస్తవిక చిత్రలక్షణమని మనదేశంలో ఎందుకనుకుంటారో నాకు బోధపడదు. వాస్తవికత అర్థం అది కాదనీ, అదే వాస్తవికత అయితే అటువంటిదాని ధరిమేనాకైనా వెళ్లనక్కరలేదనీ నేను ఈ శీర్షికలోనే కొన్నిసార్లు వ్రాశాను. వ్యక్తి జీవితం కష్టాలమూట కాదు; కష్టసుఖాల,

ఆశా నిరాశల సంఘర్షణతో కూడినది; అంతే కాక వాస్తవిక చిత్రం జీవితంమీద గాఢమైన ఆసక్తిని కలిగిస్తుంది తప్ప, జీవితమంటే భయం పుట్టేట్లు చేయదు; జీవితపు కష్టాలను తొలగించుకోవడానికి మార్గాన్ని సూచనప్రాయంగా ధ్వనిస్తుంది కాని నిరాశావాదాన్ని ప్రచారం చెయ్యదు. ఇలా నిర్మించిన వాస్తవిక చిత్రాన్ని సామాన్య ప్రజలు చూడరంటే నేను నమ్మను. యథార్థ జీవితంలోని సమస్యల సంఘర్షణకు బదులు డైలాగ్ రచయిత గారి తెలివితేటల్ని ప్రదర్శించే ఉపన్యాసాలతో నిండిన సాంఘిక చిత్రాలు తెలుగులో చాలా వచ్చాయి. వీటిని ప్రజలు చూడకపోతే, ఆ తప్పు వాస్తవికవాదంమీదికి తోసేసి మన నిర్మాతలు మళ్ళీ పౌరాణిక చిత్రాలమీదికి ఎగబడుతున్నారు. ఇదంతా మనస్సులో పెట్టుకుని "డీసికా మొదలైన వారి చిత్రాలు మీ దేశంలో నష్టపోతున్నాయా?" అని డైరెక్టర్ మెడోరీని అడిగాను.

"లేదు. బాగా విజయం పొందుతున్నాయి," అని ఆయన సమాధానమిచ్చాడు.

"ఈ వాస్తవికచిత్రాలు బాగా చవకగా తయారవుతున్నాయని విన్నాను. నిజమేనా?"

"ఊహూ. చవక ఏమీలేదు. తక్కిన చిత్రాలకు పెట్టేనంతా వీటికీ పెట్టాలి. మా లెక్కలో చెప్పాలంటే ఒక చిత్రానికి 8, 10 లక్షల రూపాయలదాకా ఖర్చవుతుంది."

"మీ చిత్రాలు ఎక్కువగా ఔట్ డోర్ లోనే తీస్తారు కదా. పైగా తారల్ని తీసుకోకుండా కొత్తవాళ్ళనే తీసుకుంటారు కదా?" అని ప్రశ్నించాను.

"అది నిజమే. కాని స్టూడియోలో తీయడంకంటే, ఔట్ డోర్ లో తీయడం చాలా కష్టం. స్టూడియోలో తేలిగ్గా లభ్యమయ్యే సౌకర్యాలు ఔట్ డోర్ లో లభ్యం కావు. కామెరా, ట్రాలీ, లైట్లు మొదలైనవాటన్నిటినీ తీసుకుపోవాలి. ఏ మ్యూజియంలోనో, రెస్టారెంట్ లోనో షూటింగ్ చేస్తే అద్దెఇచ్చుకోవాలి. వీటన్నిటికీ చాలా ఖర్చవుతుంది. ఖర్చయినప్పటికీ, వాతావరణ సహజత్వంకోసం మా దర్శకులు ఔట్ డోర్ లోనే పనిచేస్తారు."

ఆయన మరొక విషయంకూడా చెప్పాడు. ఇటాలియన్ చిత్రాల్లో సహజత్వంకోసం ఎంత శ్రద్ధతీసుకుంటారంటే వర్షదృశ్యాలు తీయవలసివస్తే వర్షంకోసం ఎదురుచూస్తారు తప్ప, స్టూడియోలో కృత్రిమంగా వర్షదృశ్యాలు ఏర్పాటుచెయ్యరు."

"నియోరియలిజం అనే కొత్తపదం ఈమధ్య ఇటలీనుంచి బయల్దేరింది. ఈ పదాన్ని మీ రెలా నిర్వచిస్తారు?"

"మా వాస్తవిక చిత్రాల్లో కథలు సాధారణంగా కల్పితకథలై ఉండవు. వార్తాపత్రికల్లో పడే సంఘటనలు కొన్ని చిత్రాలకు ఆధారమై ఉంటాయి. పత్రికల్లో పడకపోయినా, మొత్తంమీద ఎక్కడో నిజంగా జరిగిన విషయాలే కొన్నిటికి ఆధారమవుతాయి. ఈ సంఘటనల్లో దాగిఉన్న సాంఘికసత్యాన్ని బైటికి తీసుకువచ్చే విధంగా స్క్రిప్టులు తయారుచేసుకుని మా దర్శకులు చిత్రాలు తీస్తారు. ప్లాటుదృష్ట్యా చూస్తే, ఆ చిత్రాల్లో కథ అని చెప్పదగినదేమీ ఉండదు. ఒక అతిసామాన్యమైన, చిన్న సంఘటన తీసుకుని 'డ్రామా' నిర్మిస్తారు. 'రోమ్ లెవన్ ఓ క్లాక్' అనే చిత్రం దీనికి మంచి ఉదాహరణ. దీన్నే నియోరియలిజం అంటున్నారు."

"మీ చిత్రాలు మా దేశానికి ఎక్కువగా రాకపోవడానికి కారణమేమిటి?"

"మీ డిస్ట్రిబ్యూటర్లు అంగీకరిస్తే మా చిత్రాలు ఎందుకు రావు?"

"డీసికా కొత్త చిత్రాలేమైనా తీస్తున్నాడా?"

"సినిమాల్లో నటిస్తున్నాడు."

"పేరుపొందిన డైరెక్టరై ఉండి, ఆయన నటించవలసిన అవసరమేమిటి?"

"ఎందుకు నటించకూడదు?" ★

—ఎన్నార్.



కేంద్ర ఆరోగ్యశాఖా మంత్రిణి శ్రీమతి మరగతం చంద్రశేఖర్ గారి నాయకత్వాన ఆగస్టు 25 వ తేదీన రష్యాకు వెడుతున్న సాంస్కృతిక సౌహార్ద్ర సంఘం.

సంపాదకుని లేఖ:—

# రాజమన్నార్, వాసన్ గార్ల అభిప్రాయాలు

సినీ టెక్నీషియన్ల సభలో, శ్రీ పి. వి. రాజమన్నార్, ఎస్. ఎస్. వాసన్‌గార్ల ఉపన్యాసం జాగ్రత్తగా చదివాను. వీరు కొన్ని విషయాల్లో తప్పటడుగు వేశారేమోనని నా అనుమానం.

వాసన్‌గారు టెక్నీషియన్ల విషయంలో ఉచితంగా మాట్లాడలేదు. "ఫిలిం పరిశ్రమ కష్టసుఖాలు టెక్నీషియన్లకు గూడా వర్తిస్తాయి." అని చెప్పారు. కాని కార్యాచరణలో వీరిని గూర్చి అన్యాయంగా మసలుతున్నారు నిర్మాతలు. సినిమాపరిశ్రమకు టెక్నీషియన్లు వెన్నెముకవంటివారే కాని మన పరిశ్రమలో వీరికి అవంతైనా ఆదరంలేదు. వీరు అస్వతంత్రమైన వాతావరణంలో పనిచేస్తున్నారు. 'ఈ కథ యిలా ఉండాలి, ఇటువంటి సెట్టు బాగులేదు. సంగీతం మరోలా ఉండాలి' అని టెక్నీషియన్లను నిర్మాతలు బాధించినందుచే స్వతహాగా నేర్పుకలవారైనా రాణించలేకపోతున్నారు.

వాసన్‌గారు ప్రపంచంలోని పెద్దదేశాలతో పోలికగట్టారు. కాని జపాన్‌లో నిర్మాతలు తాము తీయబోయే చిత్రాన్ని దృష్టియందుంచుకొని దానికి తగిన వ్యయం చేస్తారు. మరి మనం! జపాన్‌లో ఎవరు పడితే వారు సినిమాలు తీయరు. కొన్ని సంస్థలే ప్రత్యేకించి ఉంటాయి. మనం ఆ విధంగానే చేస్తున్నామా? దీన్నిబట్టి చూస్తే సినిమాపరిశ్రమలో మనదేశానికి, ఇతరదేశాలకు పోలిక ఎక్కడుంది?

రాజమన్నార్‌గారు ఇలా అన్నారు: "సెన్సారు ఆశయాలు రెండే ఉన్నాయి. దౌర్జన్యానికి దారితీసేవాటిని, దేశంలో సాంఘిక, రాజకీయ సామరస్యాన్ని భంగం చేసేవాటిని అరికట్టడం మొదటి ఆశయం. నైతిక విలువలు చెడగొట్టే అసభ్యతను నిరోధించడం రెండో ఆశయం" సామాన్యంగా సెన్సారువారుపై లోపాలుంటేనే సెన్సారు చేస్తారు. ఇవిగాక మరేమిటి కత్తిరిస్తున్నారో అర్థంగాదు.

వాసన్‌గారు పౌరాణిక చిత్రాల పురోగమనానికి ముఖ్యహేతువు సెన్సార్లపై మోపారు, నిజానికి పౌరాణిక చిత్రాల నిర్మాణానికి, సెన్సారింగ్‌కి ఏమీ సంబంధం లేదని నిక్కచ్చిగా చెప్పవచ్చును.

—జి. రాఘవరెడ్డి, సూర్యాపేట.



ప్రతిభావారి "రేచుక్క" లో ఎన్. టి. రామారావు

## "అమరసందేశం"

సాహిణీ ప్రొడక్షన్స్‌వారి "అమర సందేశం" షూటింగ్ శీఘ్రగతిని పోతున్నది. ఇటీవలే ఔట్ డోర్ షూటింగ్ ముగించారు. మహారాజు దర్బారు సెట్టుపై పనిమాత్రం మిగిలివున్నదనీ, సెప్టెంబరు నెల ఆఖరులో విడుదలకు సిద్ధం అవుతుందనీ తెలుస్తోంది. అమరనాథ్, శ్రీరంజని, పద్మిని, రేలంగి మున్నగువారు నటించిన ఈ చిత్రంలో సంగీతం ప్రధానంగా కల ఇతివృత్తం ఉన్నది. రాజా పాడిన ప్లేబాక్ పాటలు కర్ణరసాయనంగా ఉన్నాయి.

* * *

"అంతా మనవాళ్ళే" చిత్రానికి ప్రజల నుండి వచ్చిన ప్రోత్సాహంతో సారథీవారు మరొక సాంఘికచిత్రం త్వరలో మొదలుపెడుతున్నారు. ఈ చిత్ర•



సినీ మేకప్ సామగ్రి తయారుచేసే అవార్సన్ కంపెనీవారు ఇటాలియన్ డైరక్టర్ మెషోరీ, స్క్రీపురైటర్, ఫురీనో గార్లకు అల్పాహార విందుయిచ్చిన సమయంలో తీసిన ఫోటో.

తాలూకు పాటలు ముందు రికార్డు చేస్తున్నారు.

* * *

గోకుల్ పిక్చర్సువారు తమ రెండవ చిత్రం “వదినెగారి గాజులు” ప్రారంభిస్తున్నారు. సినీ టెక్నీషియన్ల సంఘానికి కార్యదర్శిగా ఉంటున్న రజనీకాంత్ గారు మొదటిసారిగా ఈ చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు.

* * *

## అవార్సన్ ఎండ్ కో వారి సినీ మేకప్ సామగ్రి

భారతదేశంలో పెట్టుబడిదారులకు చిత్ర నిర్మాణంమీద ఉన్నంత ఆసక్తి, దానికి కావలసిన సామగ్రి తయారుచేసుకోవడం మీద లేదనడానికి తార్కాణంగా, మేకప్ సామగ్రి కూడా ఈ దేశంలో తయారు కావడంలేదని చెబితే చాలును. ముడి ఫిలిము, కామెరాలు మొదలైన ప్రధాన వస్తువులేకాక, మేకప్ సామగ్రికూడా పై దేశాలనుంచి దిగుమతి అవుతోందనేది ఆశ్చర్యకరమైన విషయమే. ఈ దృష్ట్యా, అవార్సన్ ఎండ్ కో అనే కంపెనీవారు మద్రాసులో మేకప్ సామగ్రి తయారు చేయడానికి పూనుకోవడం అభినందించదగ్గ విషయం. ఈ కంపెనీవారు ఆగస్టు 22వ తేదీన మెరీనా రెస్టారెంట్‌లో తాము తయారుచేసిన మేకప్ వస్తువులు ప్రదర్శించి చూపారు. దీనికి ఇటాలియన్ అతిథులిద్దరూ, కొందరు పత్రికాప్రతినిధులు, మేకప్ నిపుణుడు హరిబాబు, మున్నగువారు హాజరైనారు. గిడుగు సీతాపతిగారు అవార్సన్ కంపెనీవారికృషిని గూర్చి మాట్లాడారు. హరిబాబుగారు, ఇంకా మద్రాసు సినిమారంగంలోని పలువురు ప్రముఖ నటీనటులు, దర్శకులు, నిర్మాతలు అవార్సన్ వారి మేకప్ వస్తువులను ‘సర్టిఫై’ చేశారు. ఈ దేశీయ పరిశ్రమను ప్రోత్సహించడం సినిమా పరిశ్రమ విధి.

## రష్యాలో భారత చిత్రోత్సవం

సోవియట్ యూనియన్‌లో త్వరలో నాలుగు వారాలపాటు భారత చలనచిత్రోత్సవం జరుగుతుందట. ఆవారా, అంధియాన్, బైజూబావ్రా, దోబిఘా జమీన్, రాహీ చిత్రాలూ, 7 డాక్యుమెంటరీ చిత్రాలు ప్రదర్శింపబడతాయి. ఈ ప్రదర్శనాలు మాస్కోలోను, మరి 18 సోవియట్ నగరాల్లోను జరుగుతాయి. ఈ చిత్రాలన్నీ రష్యన్‌లోకీ, ఇతర సోవియట్ భాషల్లోకీ డబ్ చేయబడుతున్నాయి. ఈ చలనచిత్రోత్సవాన్ని ఇక్కడినుంచి బయలుదేరి వెళ్లే భారతీయ ఫిలిం ప్రతినిధివర్గం ప్రారంభిస్తుందట.



మద్రాస్ సోషల్ ఎండ్ కల్చరల్ క్లబ్ వారు స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంలో ప్రదర్శించిన “ఆడది” అనే నాటకంలో ఒక సన్నివేశం: రామకోటి, రామలింగయ్య, చాపనీడు, ఎ. ఎల్. నారాయణ.

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## 191. సూర్యకేంద్ర సిద్ధాంతం అంటే ఏమిటి?

సూర్యునిచుట్టూ భూమ్యాది గ్రహాలు తిరుగుచున్నాయనే సిద్ధాంతమే సూర్య కేంద్ర సిద్ధాంతము.

సూర్యుడు గ్రహాలు నక్షత్రాలు వంటి నభోమూర్తులు భూమిచుట్టూ తిరుగుచున్నట్లు కనపడతాయి. అది కేవలం ఆభాసయేయైనా కంటికి ప్రత్యక్షంగా కనిపిస్తున్నది కాబట్టి అదే నిజమని చాలకాలం ప్రజలు నమ్మేరు. నమ్మడమే కాదు; భూమిచుట్టూ సూర్యాది సమస్త నభోమూర్తులు ప్రదక్షిణం చేస్తున్నాయని సిద్ధాంతంకూడా చేసేరు. అదే భూకేంద్ర సిద్ధాంతం.

ఏ సిద్ధాంతమైనా సరే, ప్రత్యక్షానుభవ ఫలితాలతో సమన్వయం పొందినపుడే అది సత్యమైనదిగా పరిగణింపబడుతుంది. భూకేంద్ర సిద్ధాంతం విషయంలో కూడా అంతేనని వేరే చెప్పనక్కరలేదు. భూకేంద్ర సిద్ధాంతరీత్యా గుణించిన గ్రహాల స్థానాలతో ప్రత్యక్షంగా అవేక్షించి కను గొన్న గ్రహాల స్థానాలు సమన్వయం పొందేవి కావు. అందుచేత భూకేంద్ర సిద్ధాంతం తప్పని క్రమంగా శాస్త్రజ్ఞులు గ్రహించి దాని స్థానే సూర్యకేంద్ర సిద్ధాంతాన్ని (*Heleocentric theory*) ప్రతిష్ఠించేరు.

సూర్యకేంద్ర సిద్ధాంత ప్రతిష్ఠాపన గౌరవాన్ని నికొలాస్ కోపర్నికస్ (1478-1548) అనే పోలండ్ దేశ ఖగోళ విజ్ఞానికి సాధారణంగా కట్టబెట్టుతారు. భారతీయ జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు ఆర్యభట్టు, పాశ్చాత్య ఖగోళ విజ్ఞాని అరిస్టార్కస్ ప్రభృతులు లనేకులు అట్టి సిద్ధాంతాన్ని అంతకుముందే ప్రతిపాదించియున్నారు. దానిని కోపర్నికస్ పునరుద్ధరించినాడు. సూర్యకేంద్ర సిద్ధాంతాన్ని కోపర్నికస్ లేవనెత్తిన పిమ్మట మరల భూకేంద్ర సిద్ధాంతము తల యెత్తలేదు.

కోపర్నికస్ సూర్యకేంద్ర సిద్ధాంతం ప్రకారం సూర్యుడు విశ్వకేంద్ర స్థానంలో స్థిరంగా ఉన్నాడు. ఆయన చుట్టూ బుధుడు, శుక్రుడు, భూమి, కుజుడు, గురుడు, శని గ్రహాలు తమతమ నియమిత కక్ష్యలలో ప్రదక్షిణం చేస్తున్నాయి. చంద్రుడు భూమిచుట్టూ తిరుగుచు భూమితో కలిసి సూర్యునిచుట్టూ తిరుగుతున్నాడు.




ఇక శనిగ్రహ కక్ష్యకు అవల బహు దూరంలో, విశ్వాన్నంతను తనలో ఇముడ్చుకొన్న దానివలె నక్షత్ర యుక్తమైన గోళమున్నది. అది స్థిరమైనది. (మూడు పటము) గ్రహాల కక్ష్యలు వృత్తాంతము సమ్మేళనంచే ఏర్పడిన *Epicycle* ఆకారంలో ఉంటాయి. ఈ కక్ష్యల కేంద్రముందుగాక కొంచము ప్రక్కగా సూర్యుడుంటాడు.

ఆధునిక శాస్త్రదృష్ట్యా కోపర్నికస్ సూర్యకేంద్ర సిద్ధాంతము కూడా సమగ్రమైనది కాదు; లోపరహితమైనదీ కాదు. భూకేంద్ర సిద్ధాంతములో భూమి కేర్పడిన అధికతర ప్రాముఖ్యాని కందు తావులేకపోయింది. సూర్యకుటుంబానికి సంబంధించి ఎంత వరకు ఆ సిద్ధాంతాన్ని పరిమితం చేస్తే, కొంతవరకు సత్యమైనదానినిగా దానిని పరిగణింపవచ్చును. —అనంత్ ★

---

## దయ్యాలు

(11-వ పేజీ తరువాయి)

సమస్త జీవరాసులూను. అన్ని లోకాల్లున్నూ "విశ్వం విష్ణుర్వషట్కారో, భూతభవ్య భవత్ప్రభుః। భూతకృద్భూత భృద్భావో భూతాత్మా భూతభావనః॥ ఏకోవిష్ణు మహద్భూతం - పృథగ్భూతాన్య సంశయః। త్రీఁల్లోకాన్ వ్యాప్య భూతాత్మా" అని స్తుతింపబడే సర్వేశ్వరాంశా సంభూతాలే.

"తనయందు నఖిలభూతములందు నొక భంగి సమహితత్వంబున" సదా ప్రవర్తించవలెనన్నది భాగవతోక్తి. అటువంటి భూతదయకు ప్రచారం కలిగించడానికే భగవంతుడు బుద్ధావతారం ధరించినాడు. ఆ దివ్యమూర్తి "అహింసా పరమోధర్మః" అనే సర్వమత సమ్మతమైన సత్యాన్నే చాటి ప్రపంచానికి శాంతిసందేశం వినిపించాడు. ఆయన సూత్రాలు పాటించే సంఘమే సత్సంఘం. ఆయన, ఆయన ఉపదేశం - ఆ యుపదేశాలను ఆచరించి ప్రచారం చేసే సంఘం - ఇవే త్రిశరణములు.

బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి. ★



జనతావారి "పరివర్తన" లో సురభిబాలసరస్వతి, నాగేశ్వరరావు, కుటుంబరావు.

## బొంబాయిలో చలనచిత్ర వారం

బొంబాయిలో నవంబరు నెలలో చలనచిత్రవారం జరుపబడుతుందట. శాంతారాం అధ్యక్షుడుగా, డి. ఎమ్. పంచోలీ సమావేశకర్తగా, సినిమా పరిశ్రమకు సంబంధించిన అనేక సంఘాలు ఈ ఉత్సవంలో పాల్గొంటున్నాయి. వారం రోజులపాటు జరిగే ఈ ఉత్సవంలో, బొంబాయి ఫిలిం పరిశ్రమ సాధించిన విజయాలను ప్రజలకు, ప్రభుత్వానికి తెలియజెప్పడానికై ఒక పెద్దకార్యక్రమం ఏర్పాటు చేయబడింది. ఫిలిం ప్రదర్శనలు, చాచా ప్రదర్శనలు, ఊరేగింపులు, ఉపన్యాసాలు, పాటకచేరీలు ఉంటాయట.

ఇటువంటి ఉత్సవాలవల్ల పరిశ్రమకు లాభం ఉంటుందనడంలో సందేహం లేదు. భారీ ఎత్తున జరుగనున్న ఈ చలనచిత్ర వారోత్సవాలలో ఒక్క బొంబాయి సినిమా పరిశ్రమకే స్థానం ఉండడం, దక్షిణ భారతానికి గాని, ఇతర భాషల చిత్రాలకుగాని స్థానం లేకపోవడం శోచనీయం.

*　　*　　*

హితేన్ చౌధురి ప్రొడక్షన్స్‌వారు హిందీలో నిర్మించిన "బిరజ్ బహూ" చిత్రం పూర్తయినదనీ, త్వరలో విడుదల అవుతుందనీ తెలుస్తోంది. శరత్ బాబు నవల ఈ చిత్రానికి ఆధారం. "పరిణీత" నవల నుండి ఉత్తమ చిత్రం తయారుచేసిన బిమల్ రాయ్ దీన్ని డైరెక్ట్ చేశాడు. కామినీ కౌశల్, అభిభట్టాచార్య, ప్రాణ్ నటించారు. సంగీత దర్శకుడు శలిల్ చౌధురి. ఈ చిత్రం బిమల్ రాయ్ కీర్తిని ఇనుమడింప జేస్తుందని భావిస్తున్నారు.

*　　*　　*

తారాశంకర్ బెనర్జీ వ్రాసిన "భాయ్ కమల్" అనే నవలను న్యూ థియేటర్స్ వారు చిత్రం తీస్తున్నారు. పంకజ్ మల్లిక్ ఈ చిత్రంలో స్వయంగా నటిస్తాడట. సుబోధ్ మిత్ర దర్శకుడు.

*　　*　　*

జెమినీవారు హిందీలో తీస్తున్న "బహుత్ దిన్ హువే" అనే చిత్రం పూర్తి కావచ్చింది. వాసన్‌గారు స్వయంగా డైరెక్టు చేసిన ఈ చిత్రంలో పుష్పవల్లి, మధుబాల, ఆగా, ఎమ్. కె. రాధ, లలితా పావర్, స్వరాజ్ మున్నగువారు నటించారు.

*　　*　　*

విజయావారు భానుమతి స్థానంలో సావిత్రిని, సావిత్రి స్థానంలో జమునను నియోగించిన తరువాత తమ "మిస్సమ్మ" చిత్రాన్ని తిరిగి మొదటినుంచీ ప్రారంభించారు. ★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Prees. 7, Thambu Chetty St, Madras.



'యాడ మారిందంటావ్?'

ఫోటో: బి. రవీంద్రనాథ్. (గుంటూరు)

# "విజయం" - ధనంతో కూడిన అహానికా? లేక త్యాగంతో కూడిన మానవత్వానికా? నిరూపించే సాంఘిక చిత్రం

మీ అభిమాన నటీనటులతో —




డిస్ట్రిబ్యూటర్సు :— ఆంధ్ర :- జనతా పిక్చర్స్, విజయవాడ; సీడెడ్ :- విజయా, గుంతకల్లు; మైసూరు :- విజయా టాకీ, బెంగుళూ